

ఇస్తుంది,'' అంటూ జూదర్, సంచిలో చెయ్యి పెట్టి ఏమనాలో చెప్పాడు.

"ఈసంచీలోనుంచి నేను తీసినా వంటకాలు వస్తాయా?'' అని తల్లి అడిగింది.

"తప్పకుండా!'' అన్నాడు కొడుకు.

ఆమెకూడా మంత్రం చదివి తాను కోరిన వంటకం పైకి తీసింది.

"ఏమైనా, నాకు వేడివేడి జున్నుమీద భ్రమపోలేదు, నాయనా," అంటూ ఆమె రొట్టే, జున్నూ తీసింది.

"చూడమ్మా, తినటం అయిపోయాక పళ్ళాలు తిరిగి సంచీలో పెట్టెయ్యాలి. అది చాలా ముఖ్యం. సంచీని అవతల పెట్టేసి, అవసరమైనప్పుడే పైకితియ్యి. నువ్వు కావాలంటే చుట్టుపక్కలవాళ్ళకూ పేదలకూ ఎంత తిండి అయినా పెట్టు గాని, ఈ రహస్యంమాత్రం ఎవరికీ చెప్పకు. అన్నలకుకూడా, నేను ఉన్నా, లేకపోయినా భోజనం పెట్టవచ్చు." అన్నాడు జూదర్.

అతను ఇలా అంటూండగానే అతని అన్నలు వచ్చి, కింద పరిచిఉన్న విందు భోజనం చూశారు

జూదర్ తిరిగివచ్చినట్టు వాళ్ళకు చెప్పినవాడు, "మీ తమ్ముడు ఒక కంచరగాడిదమీద, ఒక నీగ్రో వెంట తిరిగి వచ్చాడు. అతను ధరించిన దుస్తులు ఎవరూ ఎన్నడూ చూసి ఉండరు —అంత అద్భుతంగా ఉన్నాయి,'' అన్నాడు.

"ఛీ, ఛీ! మనం అమ్మను మోసం చెయ్యకుండా ఉండవలసింది," అన్నాడు సాలిం.

"అమ్మ వాడికి మనం చేసినదంతా






చెప్పి ఉంటుంది. వాడు మనని గడప తొక్కనియ్యడు?" అన్నాడు సలీం.

"అయినా అమ్మది మెత్తని గుండె. అంతకంటే సాధువు మన తమ్ముడు. మన ప్రవర్తన సమర్థించుకునేటందుకు ఏదన్నా సాకు చెప్పుకుంటే వాడు ఒప్పుకుంటాడు," అనుకుని వాళ్ళు ఇంటికి తిరిగి వచ్చారు.

వాళ్ళను చూడగానే జూదర్ లేచి నిలబడి, భోజనానికి ఆహ్వానించాడు. డొక్కలు మాడుతూ ఉండటంచేత వాళ్లు సుష్టుగా భోజనం చేశారు. వాళ్లు తినటం అయిపోయాక జూదర్ వాళ్ళతో, "మిగిలినది పేదలకు పెట్టండి," అన్నాడు.

"మరోసారి తినటానికి దాచిఉంచితే నేం?" అన్నారు వాళ్ళు.

జూదర్ నవ్వి, "మరోసారి తినేవేళ అయితే ఇంత తిండీ ఉంటుంది—ఇంకా ఎక్కువే ఉంటుంది," అన్నాడు.

ఆ మాటతో ధైర్యంవచ్చి వాళ్ళు తినగా మిగిలినది బీదవాళ్ళకు పంచి, "తినండి," అని, ఖాళీ కంచాలు తెచ్చి జూదర్ కిచ్చారు. అతను వాటిని తల్లి కిచ్చి, సంచీలో పెట్టించాడు.

ఆ రాత్రి భోజనానికి జూదర్ సంచీ నుంచి నలభైరకాల వంటకాలు పైకితీసి, తల్లి వాటిని అమర్చినమీదట, తన అన్నలను భోజనానికి పిలిచాడు. భోజనానంతరం వాళ్లకు మిఠాయి మొదలైనవి పెట్టి, మిగిలిపోయినదంతా బీదలకు పంచి పెట్టమని అతను అన్నాడు

ఇలా జూదర్ అన్నలు పదిరోజుల పాటు తమ జన్మలో ఊహించని విధంగా విందులు కుడిచారు. అప్పుడు సాలిమ్ సలీమ్‌తో—

ఇంతలో తెల్లవారటంచూసి మంత్రి కుమార్తె షహరాజాద్ కథ చెప్పడం చాలించింది. (సశేషం)



ఇచ్ఛాపురపు జగన్నాథ రావు

# పరిమళించిన నిర్గంధకుసుమం

ఆఫీసునించి బయటపడి రోడ్డుమీదికి మరలగానే వెంకట్రావు ఒకసారి స్వేచ్ఛగా తన చుట్టూ చూసి చేతులు దులుపుకున్నాడు. ఉదయాన్నించీ తాను రాసిన కాగితాలూ, తిన్న చీవాట్లూ, చేసిన పొరపాట్లూ లెక్కకి మించిపోయాయి. అయితే అనుదినమూ జరిగే విషయాలు అట్టే కాలం బాధపెట్టవు; నిత్యం చచ్చేవాడికి ఏడిచేవాడెవడూ?

అలాగే అనుకుంటూంటాడు వెంకట్రావు ప్రతీ రోజూ.

"ఏం వెంకట్రావ్?''

ఎవరో తనను పిలుస్తున్నారు. గిరుక్కున వెనక్కి తిరిగాడు. దూరాన తన పూర్వమిత్రుడు ఆచారి తనని పిలుస్తూ, తనవైపే నడిచి వస్తున్నాడు. తానూ, వాడూ పూర్వం గడిపిన చక్కటి రోజులూ, వాడి చేష్టలూ, తన కనేక విధాల వాడు చేసిన ఉపకారాలూ జ్ఞప్తికి వచ్చాయి వెంకట్రావుకి.

"ఎప్పుడొచ్చావురా?"

"ఇప్పుడే బస్సు దిగాను."

"అంతా కులాసాగా?"

"ఆఁ..."

వెంకట్రావుకి మంచి రోజులు కరువు. డబ్బు కరువు. స్నేహితులు కరువు- ఇప్పుడు మాటలూ కరువయ్యాయి.

"హెల్తు ఆఫీసులో పని మీద వచ్చాను."

"అహా..."

ఇద్దరూ మౌనంగా నడుస్తున్నారు.

కాఫీహోటలు దగ్గరికి వస్తున్నకొద్దీ వెంకట్రావు గుండెల్లో దడ పట్టుకుని ఎక్కువకాసాగింది. ఆవేళ ఒకటో తారీఖు. జీతం అందుకుని తెచ్చుకుంటున్నాడు వెంకట్రావు. ఆచారికి కాఫీ

ఇచ్చుకోవాలి. వాడిచేత డబ్బులు ఇప్పిస్తే ఏం బావుంటుంది?

ఈ ఆలోచనల మధ్య రానేవచ్చింది కాఫీహోటలు. ఆచారి ఏమీ ప్రయత్నం లేకుండానే హోటల్లోకి దారి తీశాడు. వెంకట్రావు గుండెలు చేతితో పట్టుకుని వెనక నడిచాడు.

ఇద్దరూ వెళ్ళి ఓమూల కూర్చున్నారు. సర్వర్ వచ్చి "ఏం కావాలి సార్?" అన్నాడు.

"రెండు స్వీట్—"

ఆచారి నిస్సందేహంగా ఆర్డర్ చేసే సరికి గతుక్కుమన్నాడు వెంకట్రావు-రెండు ఆర్లు పన్నెండణాలు...

"ఒకటే తీసుకురా..." అన్నాడు ఎంత తగ్గినా మంచిదేనని.

"అదేమిట్రోయ్? కాశీలో వదలిపెట్టా వేంటి?"

"అహాఁ...స్వీటెందుకు అని—"

సర్వరు తెల్లబోయి చూసి, వెళ్ళి రెండు స్వీట్సు తెచ్చాడు. వెంకట్రావు కాల్తోన్న ఇనుములాగ నోట్లో పెట్టుకున్నాడు స్వీట్ని. స్వీట్ అరణాలూ హాట్ ఓ పావలా, కాఫీ—వెధవది... స్పెషల్ హోటలు—ఎనిమిదణాలు... రెండుంపావలా...

వెంకట్రావు ఓసారి తన జేబులోని డబ్బువేపు చూసుకున్నాడు. అందులో ఒక్క రూపాయి తరిగితే రుక్మిణమ్మ చేసే రాద్ధాంతమూ, గోలా చెవిలో మారుమోగటం మొదలెట్టాయ్.

పోనీ, ఆచారిని బిల్లు పే చేయనిస్తే?

"ఛా" అనుకున్నాడు వెంకట్రావు. తన కెన్నిసార్లు ఇచ్చుకోలేదు కాఫీ? తను ఎలా లేదన్నా ఆచారి చేస్తూన్న అయ్యవారి ఉద్యోగంకన్న ఎక్కువ ఉద్యోగమే చేస్తున్నాడు.

బూందీ—కాఫీ...సర్వర్ యిచ్చిన బిల్లూ తీసుకున్నాడు వెంకట్రావు. ఇంత సేపూ ఏంమాట్లాడుతున్నాడో తనకి తెలీదు. ఈ క్షణంకోసం తాను భయంగా ఎదురుచూశాడు. ఆచారి బిల్లు తీసుకునే ప్రయత్నం కూడా చెయ్యలేదు.

వెంకట్రావు బిల్లు ఇచ్చుకుని బయటికి నడిచాడు — సంతోషంతోనూ, విచారంతోనూ...వెనకాలే ఆచారి వస్తూ రెండు కిళ్లీలు కొని, ఒకటి వెంకట్రావు కిచ్చాడు.

"మరి నేను వెళ్తానూ?" అన్నాడు ఆచారి.

వెంకట్రావుకి తన పరువుప్రతిష్ఠలు త్రాసులో ఉన్నట్లు కనిపించాయి. కొంచెం ఆలోచించకుండా "రాత్రికి యింటికి వచ్చేయ్" అన్నాడు.

"చెప్పలేనురా. మూ దొంతులు వస్తాన్లే"

ఆచారి అటువైపు నడిచాడు. వెంకట్రావు ఇంటివైపు నడిచాడు

* * *

గుమ్మం ఎక్కి, తలుపు తోసుకుని వెంకట్రావు గదిలోకి వెళ్ళాడు. చొక్కా తీసి పాగాకొయ్యకి తగిలించాడు.

రుక్మిణమ్మ వచ్చి, "ఏం ఆలస్యం ఐంది?" అన్నది.

"చిన్న పని ఉండి ఆలస్యం అయిందిలే—" అన్నాడు వెంకట్రావు.

అతని జేబు తడుముతూన్న రుక్మిణమ్మ ఓసారి డబ్బంతా లెక్కచూసి తెల్లబోయి, "డబ్బు తక్కువుందే?" అంది.

"ఆ-కొంచెం తక్కువుంటుందిలే" అన్నాడు వెంకట్రావు.

"ఏం?" అన్నది రుక్మిణి ఛర్రున.

"కొంచెం ఖర్చు చేసాను." దోషిగా, దీనంగా అన్నాడు వెంకట్రావు.

"ఎందుకనీ అడుగుతున్నాను?"

"స్నేహితు డొచ్చాడులేవే."

అనేశాడు వెంకట్రావు. మరి చేసేది లేక? రుక్మిణి దగ్గర ఈ ఆటలు సాగవు. రెండుం పావలా?

"ఇలా తగలేస్తారని తెలిసే నేను తోలపెడుతూంటాను. హయ్యో! ఎంత దూబరా! ఎవడో వస్తే, మూడు రూపాయిల ఖర్చా?"

"రెండుం పావలాయే!"

"అదంటే అంతే. అయినా మగాళ్ళకి బుద్ధి ఉండకపోతే ఇంతే" నన్నది రుక్మిణి.

అంతటితో ఆ పతివ్రత శాంతించినందులకు చాలా సంతోషించాడు వెంకట్రావు. కాని, తరవాత విషయం ఇంకా అతన్ని భయపెడుతూనే ఉంది.



పోలికలు

నెమ్మదిగా, "రాత్రికి వాడిని భోజనానికి రమ్మన్నాను" అన్నాడు వెంకట్రావు - ఇల్లంటుకుందన్నట్లు.

"ఎవరినీ?" అంది రుక్మిణి కోపంగా చూస్తూ.

"నా స్నేహితుణ్నే."

"ఎందుకూ?"

"భోజనానికి."

"ఇక్కడ సేవ చేసేందుకో మనిషుందని, అడ్డమైనవాళ్ళనీ నా పీకలమీదికి తెచ్చి ఎక్కిస్తే, నేనేంచెయ్యలేను" అంది రుక్మిణి.

"అదికాదే-వాడు నాకు చాలా..."

"పీల్లేదు-అంటే పీల్లేదు" రూలింగు ఇచ్చేసింది రుక్మిణి.

వెంకట్రావుకి కోపం రాదు. వచ్చినా లాభం లేదనే విషయం అతనికి తెలుసును. అతను రుక్మిణిని బ్రతిమాల సాగాడు. కొన్ని పడికట్టు మాటలున్నాయ్ ఆమెని అంగీకరింప జెయ్యడానికి. ఆమెనీ, ఆమె తల్లినీ, చెల్లెల్నీ పొగిడే మాటలవి. వెంకట్రావు వాటిని ఆపత్సమయాలలో మాత్రమే ఉపయోగిస్తూంటాడు.

ఇవాళ అవన్నీ వాడేశాడు. అవి పని చేశాయి. ఇంకెప్పుడూ ఎవరినీ ముందరగా తన అనుమతి తీసుకోకుండా భోజనానికి పిలవనని వెంకట్రావు దగ్గర మాట తీసుకుని, రాత్రికి మిత్రుణ్ణి పిలిచినందుకు క్షమించింది రుక్మిణమ్మ.

వీధి అరుగుమీద కూర్చుని మామూలు ప్రకారం వచ్చేపోయే వాళ్ళని చూస్తున్నాడు వెంకట్రావు. సాయంత్రాలు అతను బయట తిరిగేందుకు రూల్సు అంగీకరించవు.

ఎవడో - పిచ్చివాడల్లే ఉన్నాడు. వీధంతా ధూళిచేస్తూ వస్తున్నాడు. ఓ క్షణం వినోదంగా వాడివైపు చూశాడు వెంకట్రావు. కాని, వాడు దారినిపోతోన్న ప్రతీవాడి చెయ్యీ పట్టుకొని ఏదో అరుస్తున్నాడు. తరువాత వాడిని వదిలి ఇంకో చెయ్యి. తరువాత ఇంకోటి...

కొంచెం దగ్గిరికి వచ్చాడు పిచ్చివాడు. ఒకడి చెయ్యి పట్టుకుని, "నువ్వు పుట్టినందువల్ల ఏం ఉపకారం జరిగింది?" అని గట్టిగా అడిగాడు. చెయ్యి స్వంతదారు తెల్లబోయి చూస్తూండే వికటంగా ఒక అట్టహాసంచేసి వాణ్ణి వదిలి మరో చెయ్యి తీసుకున్నాడు

వెంకట్రావు కొంచెం భయపడ్డాడు-వాడు తన జోలికి వస్తాడని.

లేవబోయాడు. కాని, పిచ్చివాడు గభీమని వచ్చి అతని చెయ్యి పట్టుకున్నాడు. ''నువ్వు పుట్టినందువల్ల లోకానికి ఏం ఉపకారం జరిగింది?" అని అరిచాడు.

వెంకట్రావు ఇంతసేపూ పిచ్చివాడికి భయపడ్డాడు—కాని, ఏదో కాంతితో వెలుగుతూన్న వాడి కళ్ళని చూశాక, అతనికి ఆ ప్రశ్న వెయ్యిరెట్ల బలంతో భయపెట్టసాగింది.

"చచ్చిపో- నీ వల్ల ఎవ్వరికీ ఉపకారం జరిగి ఉండకపోతే నువ్వెందుకూ? చచ్చిపో."

పిచ్చివాడు నవ్వాడు. వెంకట్రావు చెవుల్లో ఆ మాటలు తిరిగి తిరిగి బలంగా మారుమోగుతున్నాయ్. పిచ్చివాడు వెళ్ళిపోయాడు.

వెంకట్రావు కూర్చున్న చోటునుంచి లేవలేకపోయాడు. తాను ఎవరి కుపకారం చేశాడు? అయితే ఎందుకు బ్రతికి ఉండాలి?

అన్నీ ఆలోచించుకుంటూ కూర్చున్నాడు

వెంకట్రావు. ఎనిమి దయింది. ఆచారి జాడలేదు. అప్పుడే రుక్మిణికి కోపం రాసాగింది. వే గ ం గా ఆచారి వస్తే బాగుండు ననుకున్నాడు.

ఎనిమిదిన్నర, తొమ్మిది. ఆచారి రాలేదు.

"ఈ మాత్రందానికి నన్ను చంపేరు. స్నేహితుడువస్తాననిఎందుకు చెప్పాడు?"

రుక్మిణి నోటికి హద్దులులేవు. ఇష్టం వచ్చినట్లు మొగుణ్ణీ, వాడి మిత్రుణ్ణీ తిట్టి తరువాత భోజనం చేసింది. కోపంలో వెంకట్రావుకి అన్నం పెట్టడం మరిచి పోయింది.

* * *

వీధి అరుగుమీద పడుకున్న వెంక ట్రావు అర్ధరాత్రివేళ లేచాడు. వెన్నెల విరివిగా కాస్తోంది.

ఆ నిశ్శబ్ద వాతావరణంలో అతనికి సాయంత్రంనించీ జరిగినదంతా జ్ఞాపకం వచ్చింది—ఆ పిచ్చివాడి మాటలన్నీ జ్ఞాపకం వచ్చాయి.

"నువ్వు పుట్టడంవల్ల లోకానికి ఏం ఉపకారం జరిగింది?"

ఏం జరిగింది? తాను చిన్నప్పుడు వారాలు చేసుకుని చదివి స్కూల్‌ఫైనల్ పాసయ్యాడు. తరువాత గుమాస్తాగా చేరాడు. నాటినుంచి నేటివరకూ అదే ఉద్యోగం. వచ్చిన కాగితానికల్లా నెంబరు వెయ్యడం, అది ఎవరికి చెందాలో వాళ్లకి పంపడం. వెళ్ళాల్సిన కాగితాలకి పోస్టేజి సరిగ్గా అతికించి చిరునామా జాగ్రత్తగా వ్రాసిపంపడం.

ఇందులో ఏం ఉపకారం జరిగింది? ఏమీలేదు. పోనీ గృహస్థుడుగానైనా తానెవరికైనా ఉపకారం చేశాడా? అంత కన్నా లేదు ఈ గయ్యాళి భార్యతో ఎవరికీ ఓ పూట అన్నం పెట్టడానికైనా తనకి స్వతంత్రం లేదు.

అయితే?

తాను చచ్చిపోవాలి. తనవల్ల ప్రయో జనం లేదు లోకానికి పిచ్చివాడు చెప్పాడు - తను చచ్చిపోవాలి. వాడు పిచ్చివాడు కాదు—మహాజ్ఞాని.

ఒక్కసారి మరణం ద్వారా తాను పొందబోయే సుఖాలు వెంకట్రావు కళ్లకి కనబడసాగాయ్. తప్పు కాగితాలు పంపి నందుకు గుమాస్తాలు తనని తిట్టరు. అర్ధ మృతుడిగా ఈ జీవితం గడపనక్కర లేదు. బాధ వదిలిపోతుంది.

నిజమే, చచ్చిపోవాలి.

వెంకట్రావు లేచాడు. ఎలా చచ్చి పోవాలనే సమస్య అతనికి ముఖ్యమైనది కాదు. ఊరుబయట నుయ్యి ఉంది. బావుల నుయ్యి. తొందరగా నడవ సాగాడు. ఈకష్టాలకీ, ఈజీవితానికీ, ఈ నాటితో స్వస్తి. నడిచాడు, నుయ్యి కని పిస్తోంది వెన్నెట్లో. తనకోసమే అది అక్కడ ఉన్నట్లు కనిపిస్తోంది.

చిరునవ్వు నవ్వుదామనుకున్నాడు వెంకట్రావు. నవ్వలేకపోయాడు. కాళ్ళు

కొంచెం నెమ్మదిగా అడుగువెయ్యడం ప్రారంభించాయ్.

హఠాత్తుగా, ఆ ప్రశాంతతని చీల్చుకుంటూ ఓ వికటాట్టహాసం వినిపించింది. వెంకట్రావు అడుగుతీసి అడుగు పెట్టలేకపోయాడు...భూత ప్రేత పిశాచ...

ఎవరూ కాదు. పిచ్చివాడు ఆ నూతి పక్కనించి నడిచివచ్చి వెంకట్రావు చెయ్యి పట్టుకుని, "ఎందుకొచ్చావ్?" అన్నాడు.

"చచ్చిపోడానికి..."

"ఏం?"

నిశ్చింతగా చెప్పాడు వెంకట్రావు- "నేను ఎవరికీ ఉపకారం చెయ్యలేదు" అని.

ఈసారి తేలిగ్గా నవ్వాడు పిచ్చివాడు.

"మూర్ఖులు!... మూర్ఖుడివి!" అని అరిచాడు.

వెంకట్రావు తెల్లబోయాడు.

"నువ్వు చావొద్దు. పో" అన్నాడు.

వెంకట్రావుకి కొండంత ధైర్యం వచ్చింది.

"కాదు-నువ్వే చెప్పావ్ చావమని. నేను చచ్చిపోతాను" అన్నాడు.

"...లేదు. నువ్వు చాలా ఉపకారం చేశావ్. నీవల్ల ప్రపంచానికి గొప్ప ప్రమాదం తప్పించబడింది" అన్నాడు పిచ్చివాడు.

వెంకట్రావు తెల్లబోయాడు.

"నావల్లనా?ఉపకారమా?"అన్నాడు.

"అ! నీ భార్య గయ్యాళి కదూ?"

"ఔను...మహా గయ్యాళి!"

"వెర్రివాడా! ఆమెని పెళ్ళాడి ఓ మనిషిని రక్షించావ్. ఆ బాధలన్నీ వాడికి బదులు అనుభవిస్తున్నావ్. ఇంతకన్న ఉపకారం ఏముంది? పో" అన్నాడు పిచ్చివాడు

వెంకట్రావు ఇక ముందడుగు వెయ్య లేకపోయాడు. వెనుదిరిగి వేగంగా నడవ సాగాడు. తరువాత పరిగెట్టసాగాడు. ఉపకారం చేశాడు! తనవల్ల లోకానికి ప్రయోజనం ఉంది! పరుగు...వేగం... మహా వేగం.

మర్నాడు ఉదయం వెంకట్రావుకి పెద్ద జ్వరం వచ్చింది. అలా జబ్బు పడ్డందుకు రుక్మిణి అతన్ని చెడతిట్టి పోసింది.







# మేం చేసిన తప్పు మీరూ చేస్తారా?

## అవసరాల రామకృష్ణారావు

తెలతెల్లవారే ఆ చల్లనివేళ కిటికీ తలుపులు తీసిచూసింది దయామయి. అంత వెర్రెత్తిపోడానికేముంది. అడవిలాంటి ఈ లోకంలో విరబూసిన, వెర్రి వేపపూగుత్తులు తప్ప! అంత మైమరచిపోడానికేముంది. ఎడారిలాంటి ఈ ఆకాశంలో నలనల్లని పిచ్చిమబ్బులు తప్ప!

అట్టడుగుకు మునిగిపోతున్నవారికేనా సరే ఒక చల్లనిచూపుతో ఒక మెత్తని స్పర్శతో ఒక తియ్యని మాటతో జీవితంమీద ఆశ రేకెత్తించగల క్రైస్తవ మత ప్రచారకురాలు ఆమె. ఎటువంటి మోహపుభ్రాంతికీ సందు ఇవ్వకుండా బండరాయిలా బ్రతుకుదామని ప్రభువు ముందు ప్రతిజ్ఞతీసుకున్నా ఆ రాయిలో బీటలు తప్పలేదు. అందులో మళ్ళీ అనురాగపు ఊటలు ఉబికి ఉబికి ప్రవహించకనూ మానలేదు!

క్రమబద్ధంగా విధి నిర్వహించుకుపోతున్నా ఆమెను ఆ ప్రశ్న ఇరవైనాలుగుగంటలూ నిలదీయకమానలేదు. 'పాపం ఆ అమ్మాయి మళ్ళీ మనుషుల్లో పడుతుందా?'

'నీ కర్తవ్యం మాత్రమే నువ్వు నిర్వహించు, ఫలితం ఆ ప్రభువుకువదిలిపెట్టు' అనే సూక్తి ఆమె ఎవరికేనా బోధించగలుగుతోంది, తనకి తప్ప!

'చూడండి దయామయీ అన్నీ తెలిసినవారు మీరు. ఎందుకింత కలవరపడతారు? ఆ అమ్మాయి శారీరిక ఆరోగ్యానికి ఎటువంటి లోపమూలేదు. పోతే మనస్సే బాగా గాయపడ్డట్టు కనిపిస్తోంది.





# మేం చేసిన తప్పు మీరూ చేస్తారా?

## అవసరాల రామకృష్ణారావు

తెలతెల్లవారే ఆ చల్లనివేళ కిటికీ తలుపులు తీసిచూసింది దయామయి. అంత వెర్రెత్తిపోడానికేముంది. అడవిలాంటి ఈ లోకంలో విరబూసిన, వెర్రి వేపపూగుత్తులు తప్ప! అంత మైమరచిపోడానికేముంది. ఎడారిలాంటి ఈ ఆకాశంలో నలనల్లని పిచ్చిమబ్బులు తప్ప!

అట్టడుగుకు మునిగిపోతున్న వారికేనా సరే ఒక చల్లనిచూపుతో ఒక మెత్తని స్పర్శతో ఒక తియ్యని మాటతో జీవితంమీద ఆశ రేకెత్తించగల క్రైస్తవ మత ప్రచారకురాలు ఆమె. ఎటువంటి మోహపుభ్రాంతికీ సందు ఇవ్వకుండా బండరాయిలా బ్రతుకుదామని ప్రభువు ముందు ప్రతిజ్ఞతీసుకున్నా ఆ రాయిలో చీటలు తప్పలేదు. అందులో మళ్ళీ అనురాగపు ఊటలు ఉబికి ఉబికి ప్రవహించకనూ మానలేదు!

క్రమబద్ధంగా విధి నిర్వహించుకుపోతున్నా ఆమెను ఆ ప్రశ్న ఇరవైనాలుగుగంటలూ నిలదీయకమానలేదు. 'పాపం ఆ అమ్మాయి మళ్ళీ మనుషుల్లో పడుతుందా?'

'నీ కర్తవ్యం మాత్రమే నువ్వు నిర్వహించు, ఫలితం ఆ ప్రభువుకువదిలిపెట్టు' అనే సూక్తి ఆమె ఎవరికేనా బోధించగలుగుతోంది, తనకి తప్ప!

'చూడండి దయామయీ అన్నీ తెలిసినవారు మీరు. ఎందుకింత కలవరపడతారు? ఆ అమ్మాయి శారీరిక ఆరోగ్యానికి ఎటువంటి లోపమూలేదు. పోతే మనస్సే బాగా గాయపడ్డట్టు కనిపిస్తోంది.

డానికి కాటోలు అప్పుడే సూర్యుడు ఉదయించాడు.

మరొకమారు కళ్ళెత్తి చూసింది దయామయి.

ఆ క్షణం ఆమె కి లోకం అడవిలా గాని, ఈ ఆకాశం ఎడారిలా గాని కనిపించలేదు. వెర్రి వేపపూగుత్తులయితేనేం, వెన్నెలలో సిల్వర్ ఓక్ వింత సోయగాన్ని గుర్తుకు తెస్తున్నాయి, పిచ్చి మబ్బులని పేరు పడితేనేం, రోజ్ పౌడరు అద్దుకుని ముస్తాబు చేసుకుంటున్నాయి! ఎంత చక్కనిది ఈ ఉదయం!

* * *

ఆ తరువాత నెలరోజులు గడిచేక ఓ రోజు దయామయి యాలిస్‌కి బైబిల్ చదివి వినిపిస్తోంది;

'ఇప్పుడు మనం మత్తయి సువార్త అయిదవ అధ్యాయంలో ఉన్నాం.

అప్పుడు ఏసుక్రీస్తు ఆ జనస మూహాల్ని చూసి కొండ ఎక్కి కూర్చుండగా ఆయన శిష్యులు ఆక్కడికి వచ్చారు. అప్పుడాయన చేసిన బోధ ప్రారంభం ఇదే:

దీనాత్ములు ధన్యులు - పరలోక రాజ్యం వారిది.

దుఃఖితులు ధన్యులు - ప్రభువు ఓదార్పు వారిది

సాత్వికులు ధన్యులు-సజ్జనుల సానుభూతి వారిది.

అందరి మంచికోసం ఆకలిదప్పులు మరచేవారు ధన్యులు-సరియైన సంతృప్తి వారిది.

దయామయులు ధన్యులు-ప్రభువు కరుణ వారిది.

పరిశుద్ధాత్ములు ధన్యులు-ప్రభువు దర్శనం వారిది.

శాంతిదూతలు ధన్యులు-దేవుని బిడ్డలని పిలవబడే అదృష్టం వారిది.

మంచికోసం హింసకు గురి అయ్యేవారు ధన్యులు-పరలోక రాజ్యం వారిది.'

'ఆపండి. అక్కడితో ఆపండి. మనిషిని మత్తులో ముంచే ఈ మత బోధనలు ఇక చాలు!' యాలిస్ అరిచింది. చదువుతున్నది ఆపి, తెల్లబోయి ఆమె వైపు చూసింది దయామయి.

'పరలోక రాజ్యంమాట ప్రభువు ఎరుగు, ఇక ఇహలోక ప్రాప్తం అంటూ లేదా? దుర్మార్గాలికీ వంచనకీ గురైనిండు జీవితానిలా భగ్గున మండిపోవలసిందేనా? అనుక్షణం అరిగిపోతూ ఎదుటివారికి సుగంధం అందజేసే మంచి గంధపుచెక్క మాత్రమేనా మానవ జీవితం!'

దయామయినుంచి ఎటువంటి జవాబూ రాకపోవడంచూసి యాలిస్ ఇటుతిరిగింది. ఆమె అక్కడలేదు! కనుకొలుకుల్లో గూడు కట్టుకుంటున్న తేమను తుడుచుకుని ఆతృతతో లేచింది యాలిస్. వంచిత అయిన తనని చేరదీసి రక్షించిన కృపామయి ఆమె. నెలరోజుల క్రితం

ప్రమాదవశాత్తు తను ఆమె కారుకింద పడితే ఆస్పత్రిలో చేర్పించి చికిత్స చేయించింది. పూర్తిగా కోలుకున్నాక అయినా తన దారిన తాను పోతానంటే ఒప్పుకోక 'యాలిస్, ఎవరూ లేనిదాన్లా కనిపిస్తున్నావు. అలాంటిదానివి నువ్వు ఒక్కర్తివే కాదు, నేనుకూడా. మనిద్దరం ఒకచోట ఎందుకుండకూడదు?' అని తన ఇంటికి తీసికెళ్ళి ఆశ్రయం కల్పించింది. దయామయితో ఉండడానికి యాలిస్ రెండు షరతులు పెట్టింది. తనకి పూర్తిగా బలం చేకూరిన తర్వాత ఏ చిన్న ఉద్యోగమేనా చేసి తన పొట్ట తను పోషించుకోనివ్వాలి. తన గత జీవితంగురించి దయామయి ఏమీ అడగకూడదు.

ఉన్నట్టుండి ఈమె ఎక్కడికి వెళ్ళినట్టు? యాలిస్ లోపలి గదిలోకి వెళ్ళింది. అటువైపు తిరిగి, కన్నీళ్ళను ఆపుకోడానికి వ్యర్థప్రయత్నం చేస్తోంది దయామయి. ఎంతో ప్రయత్నంమీద తప్ప యాలిస్ ఆమె దుఃఖాన్ని ఆపించి తన వైపు తిప్పి కూర్చోబెట్ట లేకపోయింది.

'బాధ అంటే తెలియనిదాన్ని కాను. సేవలో ప్రేమలో కప్పిపుచ్చుదామని ప్రయత్నిస్తున్నా మీ చిరునవ్వుల వెనక దాగిఉన్న వేదనల బారికలు పసిగట్ట లేనంత పసిదాన్ని కాను. అయినా తవ్వుకున్నకొద్దీ లోతు పెరిగే గోతిలాంటిది దుఃఖం. అందుకని నా గురించి చెప్పలేదు, మీ గురించి అడగలేదు. కాని నా మామూలు మాటకి మీ హృదయం ఈ రోజు ఎందుకిలా స్పందించి రోదిస్తోందో తెలుసుకోకుండా ఉండలేకపోతున్నాను ...'

'తెలిసో తెలియకో ఇందాక నువ్వు అడిగేవే, మానవ జీవితం మంచి గంధపు చెక్కమాత్రమేనా, అని? కఠోరమైన ఆ సత్యాన్ని తట్టుకోలేక తల్లడిల్లి పోయిందమ్మా నా మనసు! మత బోధల ముసుగులో మనసుని దాచిపెట్టినా ఆత్మీయురాలి ముందు అసలు రూపం బయటపడిపోక తప్పలేదమ్మా యాలిస్!'

దయామయి ఆమె రెండుచేతులూ పట్టుకుంది.

ఆ స్పర్శకి యాలిస్ కళ్ళు రెండూ మళ్ళీ వెన్నెల మడుగులయ్యాయి.

'తల్లీ తండ్రీ తెలియనిదాన్ని. ఆప్యాయతా, ఆత్మీయతా పోగొట్టుకున్నదాన్ని. నన్నెందుకింకా ప్రలోభ పెడతారు? భరించలేని ప్రేమ పంచి నన్నెందుకింకా పిచ్చిదాన్ని చేస్తారు?'

దయామయి నయనజలధారల్లో క్రొత్త మెరుపు ఒకటి స్పష్టంగా కనిపించింది యాలిస్‌కి. అంతకుముందు వినిన గర్జన లాంటిదికూడా వినిపించింది. 'ఎందుకా? ఎందుకంటావా? నేనూ ఓ పిచ్చిదాన్ని కనక. భవబంధాలు తెంపుకోలేకపోతున్నాను కనక. తాత్కాలికంగా కట్టుదిట్టం చేసుకున్నా, నిన్ను చూడగానే

మళ్ళీ నాలోని పిచ్చి తిరగబెట్టింది తనక.'

'మిమ్మల్ని అర్థంచేసుకోలేకపోతు న్నాను, నన్ను క్షమించండి, మదర్.'

'మదర్! ఎంతమంచి పిలుపు! ఎన్నేళ్ళకు విన్నాను మళ్ళీ ఇంత ప్రాణప్రదమైన పిలుపు! నాతల్లీ, మెర్సీ, మళ్ళీ ఇన్నాళ్ళకు బతికొచ్చేవా? ఇరవై ఏళ్లై ఎండిపోయి, మోడులా బతుకుతున్న ఈ హృదయంలో నునులేత చిగుళ్లు నిండుగా నెలకొల్పడానికి ఈ రూపంలో మళ్ళీ మా యింటికి వచ్చావా మెర్సీ?'

దయామయి యాలిస్‌ని దగ్గిరగా తీసుకుని ముద్దులవర్షం కురిపించింది. ఆ కళ్ళల్లో నీరు, ఆ నోటిలో తడి, ఉద్రేకంతో గగుర్పొడిచిన ఆ వృద్ధురాలి శరీరంలోని స్వేదం—అన్నిటినీ మించిన ఆ ఆర్ద్రిత యాలిస్‌ని ఉక్కిరి బిక్కిరి చేశాయి. ఏవిధంగా చూసుకున్నా సృష్టికి మూలకేంద్రం ఒక బిందువేమో అనిపించింది ఆమెకి.

'మెర్సీ ఎవరు మదర్, మీ డాటరా? పాపం చిన్నతనంలోనే పోయిందా?'

ఉన్నట్టుండి గంభీరంగా మారి పోయింది దయామయి మొహం.

'అవును. చాలా చిన్నతనంలోనే అద్దంలాంటి నా జీవితం చేతుల్లోంచి జారి ముక్కలయి పోయింది. ఇవాళ నీకది పూర్తిగా చెబుతాను. ఎందుకు లేచి నిలు చున్నావ్, కూచో...ప్రేమకు శాసించే హక్కుకూడా ఉందని నీకు తెలీదా? చెప్పకపోవచ్చు, వినడానికికూడా నువ్వు నోచుకోలేదా?'

చిన్న చినుకుగా ప్రారంభించి పెను తుఫానుగా పరిణమించిన తన గత జీవితాన్ని ఆ సాయంకాలపు చిరుచీకటివేళ దయామయి తనకు తానుగా యాలిస్ ముందు బయటపెట్టుకోక తప్పలేదు.

* * *

దయామయికి ఇరవై అయిదేళ్లున్నప్పుడు ఒక ప్రైవేటు హాస్పిటల్‌లో నర్సుగా పనిచేసేది. నర్సు ట్రైనింగ్ అయినప్పుడు చెప్పబడ్డ విధులకి మంచితనం మానవత్వం కలిపి రోగులసేవలో మునిగిపోవడం తప్ప ఆ రోజుల్లో ఆమెకింక వేరేలోకం ఏమీ ఉండేదికాదు. అక్కడే అసిస్టెంటు సర్జన్‌గా నియమితుడైన జేమ్సుకి కూడా కర్తవ్య నిర్వహణతప్ప వేరే ప్రపంచం ఉందని ఆరోజుల్లో ఓ సాయంకాలంతప్ప ఆమెకి తెలిసిరాలేదు.

'ఎంతసేపూ ఈ మందుల వాసనలూ ఈ మందభాగ్యుల మూలుగులూ... మీకేం విసుగెత్తడంలేదా మిస్ దయా?'

'అన్ని మబ్బులున్నా అక్కడక్కడ మెరుపులున్నాయనేకదా మనంబతుకుతాం డాక్టర్? ఎవరైనా అంతే ... ఈ క్షణం చల్లబడి పోతుందనుకున్న శరీరం ఇంకో గడియకి వేడెక్కుతుందనే ఆలోచన, అలా జరగడంలో శతాంశమైనా

మన కృషి ఉందనే తృప్తి ఇంతకు మించిన వరముందా? తడారిపోయిన దీపిక ఒకసారైనా మళ్ళీ వెలగడంలో మనం సాయం చెయ్యగలుగుతే ఎలాంటి చీకటి అయినా పారిపోక ఏంచేస్తుంది డాక్టర్?'

జేమ్సు ఆమెవైపు రెప్పవాల్చకుండా చూశాడు.

'ఎందుకలా చూస్తున్నారు?'

'ఈ వయసులో ఇలాంటి పాఠాలు మీరెక్కడ నేర్చుకున్నారా అని.'

దయామయి వాచీ చూసుకుంది.

'సరిగ్గా సమయానికి జ్ఞాపకంచేశారు. ఇప్పుడే బయల్దేరితేగాని అయిదున్నరకి నేనక్కడికి చేరలేను. మీకు తెలుసుగా, న్యూబైబిల్ స్కూల్లో ఈవెనింగ్ క్లాసెస్ ఓపెన్ చేశారు. ఇన్‌స్ట్రక్షనూ, బుక్సూ అన్నీ ఫ్రీ. ఎవరేనా చేరొచ్చు. అప్పుడే సగంకోర్సు కంప్లీట్ చేశాను. ఏదో సాయంకాలం సత్కాలక్షేపం... వేళయిపోతోంది.'

'అలాగే వెళ్ళొచ్చుగాని చిన్న రిక్వెస్టు.'

'ఏమిటది డాక్టర్, బెడ్ నంబర్ ట్వంటీ మళ్ళీ అల్లరిపెడుతున్నాడా?'

'అబ్బబ్బ ఎంతసేపూ ఆస్పత్రీ చర్చి...ఇంతకన్న మనిషికి ఇంకేం లేవా?'

'ఉన్నాయా?'

'ఉన్నాయి. ఈ రోజు ఈ ఒక్క రోజూ నువ్వు నాకోసం వాటికి గుడ్‌బై కొట్టక తప్పదు.'

ఉన్నట్టుండి తనని ఏకవచనంతో పిలిచే జేమ్సుని చూస్తే దయామయికి ఆశ్చర్యం ఆగలేదు. అయితే ఆశ్చర్య మంతా మిగిలిన వాక్యంలోనే ఉంది. దాని పతాకశీర్షిక అతను ఆఖర్న చేసిన చేష్టలోనే ఉంది.

'ఇవాళ మనిద్దరం 'హౌటు లీడ్ ఎ ప్లెజెంట్ లైఫ్' సినిమాకు వెడుతున్నాం. అక్కడ నీకో ముఖ్యమైన విషయం చెప్పాలి. అంత సస్పెన్స్ అంతవరకూ నువ్వు భరించలేవు గనక దానికి సూచనగా, కెన్ ఐ క్లెయిమ్ ఎ స్వీట్ లిటిల్ కిస్ ఫ్రమ్ యు ఫర్ ది టైమ్ బీయింగ్?'

మరుక్షణం మిస్ దయ అక్కడ లేదు.

అంతేకాదు.

అనుకున్న ప్రకారం సినిమాహాల్‌కి కూడా రాలేదు!

'దయా, నీకొక్కరికేనా మానవ సేవలో మాధుర్యం తెలిసింది? నువ్వు చెప్పుకున్నావు. నేను చెప్పాలను కున్నాను. అంతే. మన జీవనగమ్యం ఒక్కటే. వేరు వేరుగా మనుషులం కనిపిస్తున్నా మన మనుగడల లక్ష్యం ఒక్కటే. అసలు మనిద్దరం ఒకటే. ఆ శుభముహూర్తం ఎప్పుడంటావు?' అని చెప్పాలనుకున్నాడేమో జేమ్సు.

అరగంటకంటె ఆ సినిమాహాల్‌లో వెయిట్ చెయ్యలేకపోయాడు.

బరువెక్కిన హృదయంతో బయటకు వచ్చేస్తూంటే దయ కనిపించింది.

ఆలస్యంచేసి అతని ఆనందాన్నంతా చేతులారా ధ్వంసం చేశాననే పశ్చాత్తాపం కొంచెమైనా ఆ మొహంలో కనబడలేదు. పైగా రోజూకంటె హుషారుగా కనిపించింది!

'రూమ్‌కి వెళ్ళేసరికి న్యూయార్క్ టైమ్సువచ్చి పడుంది డాక్టర్. ఇంకా టైం ఉంది కదా ఓసారి హెడ్‌లైన్స్ తిరగేస్తూంటే 'హౌ చెషైర్‌హోమ్స్ స్టార్టెడ్' అనే వ్యాసం నన్ను ఆకర్షించింది. చెషైర్ ఎవరో మీకు తెలుసుగా, సెకండ్ వరల్డ్ వార్‌లో బాంబర్ పైలట్. జపాన్‌లో హిరోషిమామీద ఏటం బాంబులు వేసిన విమానం నడిపింది అతనే. అంత ఎత్తునుంచి అంత లోతుకి ఎలా చూడగలిగాడోగాని, ఆ దారుణ విధ్వంసకాండ పరికించి కళింగయుద్ధం చూసిన అశోకుడికంటె అతను సశోకుడై ఉండాలి. 'నా బతుకు మనుషుల్ని ఏడ్పించడానికి కాదు, ఏడ్చేవాళ్ళని ఓదార్చడానికి' అని అప్పుడే తెలుసుకుని ఉండాలి చెషైర్. ముప్పై ఏళ్ళు రాకుండానే అత్యున్నతమైన ఉద్యోగస్థాయికి చేరుకోగలిగిన ఆ యువకుడు ఆ అనుభవంతో కళ్ళుతెరిచి వెంటనే రిజైన్ చేశాడు. నిర్మాణాత్మకమైన కృషి ఎలా ప్రారంభించాలో ఓ పట్టాన అర్థంకాక అతను మొదట్లో చాలా ఎదురుదెబ్బలు తినవలసి వచ్చిందట. ఏం డాక్టర్, గబగబా చెప్పుకుపోతున్నానేమో, ఫాలో అవగల్గుతున్నారా?'

'నిన్ను ఫాలో అవడం అంత సులువు కాదు మిస్ దయా! కాస్సేపు నాకు టైం ఇయ్యి. ఈ పార్కులో ఇక్కడ కూచుందామా?'

ఇద్దరూ కూచున్నారు.

'హాల్లో సినిమా చూస్తూ నీ పక్కన కూచోడం ఎంతో బాగుంటుందనుకున్నాను. హౌ ఫూలిష్ ఐయామ్! నీ కబుర్లలో ఎన్ని సినిమాకథలు లేవు, చెప్పు, చెప్పు.'

'అలాంటి అయోమయపు అవస్థలో పడిన చెషైర్‌కు పాత ఫ్రెండ్ పంపిన కబురు ఒకటి ధృవతారలా దొరికింది. 'నాకు కేన్సరు అని నిర్ణయించారు. ఇక మూడునెలలకంటె ఎక్కువ బతకనని చెప్పారు. గుండె పగిలే ఈ దారుణ వార్తకికూడా నేను చలించడంలేదు. అన్నిటికీ ఏనాడో సిద్ధపడి ఉన్నాను కనక. కాని ఇక వ్యాధి కుదరదని నిర్ధారించబడిన రోగికి ఇక ఈ ఆస్పత్రిలో చోటులేదట. ఇక్కడే కాదు నాలాంటి రోగులకి ఏ ఆస్పత్రిలోనూ బెడ్ ఇవ్వరుట. ఉన్న పాళంగా ఎక్కడికిపోను, ఇంకా మూణ్ణెల్లు బతకాలిగా, నీ దగ్గరకి రానా?' ఇదీ ఆ కవరులోని కబురు. ఈ

లేఖ అందేసరికి చెషైర్ ఇల్లు అప్పుల్లో మునిగి ఉంది. పొలం తనఖాకు పెట్టబడి ఉంది, విలువైన ఫర్నిచరు అంతా కోర్టు స్వాధీనంలో ఉంది. అయినా ఎవరూ ఎప్పుడూ ఆక్రమించలేనిది అతన్లో ఒకటి మిగిలే ఉంది. కష్టపడో కన్నం వేసో గదికి సరిపడే కరెన్సీ సంపాదించ వచ్చు. ఆ ఎత్తు వజ్రాలు తూచి ఇచ్చినా అగ్గిపెట్టెకు సరిపడే ప్రేమ ఎక్కడా బజార్లో దొరకదుగా! చెషైర్ దగ్గిర ఉన్న అమూల్యమైన సంపదే అది! అతనికంటె సౌభాగ్యవంతుడెవరు ఈ లోకంలో. అందుకే నిలుచున్న పళాన్ని ఇచ్చాడు టెలిగ్రాం ఆ ఫ్రెండుకి 'వెంటనే రా' అని! వింటున్నారా డాక్టర్?'

'వినడమే కాదు, ఇంకా చాలా చాలా చేస్తున్నాను. కేరీ ఆన్.'

'చెషైర్ ఇంటికి చేరుకున్నాక అనుకున్నట్టే ఆ ఫ్రెండ్ మూడు నెలలలో చనిపోయాడు. క్యాన్సరువల్ల కలిగేవ్యధ ఊహకుకూడా అందనంత దారుణమైనది అంటారు. మృత్యు ముఖంలో ఆమూడు నెలలూ ఎంత దుర్భరమైనవో అని ఎవరైనా అనుకుంటారు. కాని ఆ ఫ్రెండ్ తన డైరీలో రాసిందేమిటో తెలుసా? 'ఇన్నేళ్లు బతికేను, కాని ఈ చివరి మూడు నెలలంత ఉల్లాసకరంగా నేనెప్పుడూ జీవించలేదు!' ఈ వాక్యమే చెషైర్ జీవితానికి మార్గదర్శి అయి ఉండాలి. ఇలాంటి ఇన్‌క్యూరబుల్స్, అన్‌వాన్‌టెడ్, అన్‌కేర్డ్‌ఫర్, డిసేబుల్డ్, క్రిపుల్డ్ ఇంకా ఎందరెందరున్నారో! విధి వక్రించిన సాటి మానవుడు వెదలనడిపిన ఆర్తులూ అనాథలూ ఇలాంటి వారికోసం శరణాలయాలు స్థాపించడంకన్న మానవత్వం ఏముంది! అవే స్థాపించాడు ఆయన. మొదట్లో సహజంగా కొన్ని ఇబ్బందులకు గురైనా భూదేవి పూర్తిగా పుచ్చిపోలేదు గనక అతని పనికి త్వరలోనే గుర్తింపు కలిగి, ధారాళంగా విరాళాలు వచ్చిపడ్డాయి. నోబిల్ శాంతి బహుమతి ముక్కున కరుచుకునే వరకు అతని కీర్తి కపోతం ఎగిరింది. నేడు విశ్వవ్యాప్తంగా ఉన్న చెషైర్ హోమ్స్ పుట్టుక అదిట...అయ్యయ్యో, నాకెంత మతిలేదు, ఇదంతా మీకు తెలియదనేనా చెప్పడం?'

జేమ్సు మనోహరంగా నవ్వుతూ అన్నాడు.

'తెలిసినా తెలియకపోయినా మనకు ఇష్టమైనవాళ్ళ నోటినుంచి ఎన్నిసార్లు విన్నా తనివి తీరదు దయా!'

'అంత ఇష్టమైనదాన్నా మీకు!'

'మనిద్దరి ఇష్టా ఇష్టాలూ ఒకటే అయినప్పుడు ఒకరికొకరం ఇష్టం కాకుండా ఎలా పోతాం దయా! ఇవాళ చాలా తెలుసుకున్నాను నీ దగ్గిర.'

'ఏమిటి! చెషైర్ చరిత్రా? అది అంతకుముందు మీకు తెలీదా!'

(సశేషం)




మనిషి మెత్తనైతే మొత్తబుద్దేస్తుంది.

మురహరి మెత్తటివాడనడంలో ఏమీ సందేహంలేదు. పైగా సిగ్గరి. ఆడపిల్ల కనిపిస్తే-నిద్రగన్నేరాకులా ముడుచుకు పోతాడు. సిగ్గుపడి తప్పుకు తప్పుకు నడుస్తాడు. ఆడవాళ్ళు దార్లో తగిలితే వాళ్ళు దగ్గరయ్యేకొద్దీ ... పాతకాలపు పెళ్ళికూతుర్లా తలదించుకుని ఊపిరి బిగబట్టి వాళ్ళని ఎప్పుడు దాటుకుపోతానా, ఎప్పుడు గండం గడుస్తుందా అని ఉక్కిరిబిక్కిరవుతాడు. చాలామంది అమ్మాయిలకి మురహరి మొహంలో ఈ రసాయనిక మార్పుల్ని చూసి తరించడమంటే ఎంతో సరదా. అతను ఒంటరిగా కనిపిస్తే ఓ పట్టాన వదిలేవారుకారు. అల్లరిపెట్టి వినోదించేవారు. మురహరంటే కాలేజీ అమ్మాయికీ అలుసే. హైస్కూలు అమ్మాయిలకీ అలుసే — ఎలిమెంటరీ స్కూలువదలి అపుడే హైస్కూల్లో అడుగుపెట్టిన ఆరోక్లాసు పాపకీ అలుసే.

మురహరి ఒకనాటి సాయంత్రం— షైర్టు షికార్లు ఆమడదూరం గాబట్టి-బుద్ధిగా డాబామీద చదువుకుంటున్నాడు. గణగణ చదివే అలవాటేమో-వాయింపు ధోరణిలో సాగిపోతున్నాడు. కాస్సేపటికి మరో గణగణధ్వని-ఆడధ్వని వినిపించి అదిరిపడ్డాడు. ఎంతసేపట్నుంచి తనని గమనిస్తుందో ఉష వాళ్ళ మేడమీద బాల్కనీలోనుంచి తనవంక చూస్తూ - రెండు అరచేతుల్ని ఉత్తుత్తి పుస్తకంలా చేసుకొని తొడతొడ చదువుతున్నట్టు నటిస్తూంది. 'అంటే తన చదువుని గేలి చేస్తుందన్నమాట' అన్నభావం రాగానే మురహరి ఉడికిపోయి ఠక్కున పుస్తకం మూసేసాడు. ఉష పెద్ద చప్పుడుతో ఉత్పత్తి పుస్తకమనే చేతుల్ని మూసి పారేసింది. ఛి ఛి. అని మూలుక్కున్నాడు. ఆమె అచ్చం అలాగే విసు







క్కుంది. అతను చేతుల్లో మొహం దాచు కొని కణతలు నొక్కుకున్నాడు. ఓరగా చూస్తే—ఆమెకూడా మొహం చేతుల్లో యిరికించి కణతలు నొక్కుకుంది. మరో సారి...మరోసారి అయితే తల దించు కొనేవాడేగానీ మురహరికి ఆమె అభి నయం...ఆ రకం ఆటపట్టింపుచూసి తల దించబుద్ధి కాలేదు. తను ఏం చేస్తే ఆమె అది చేస్తుంది. వట్టి కవ్వింపు. ఆక తాయితనం. విసిగిఉన్నాడేమో 'ఎన్నాళ్లీ ఆడపోరు. చివరికి యింటిపక్క ఉషకి కూడా లోకువా నా బ్రతుకు' అని వాపో యాడు. అతనిలో తిరుగుబాటుతనం తలెత్తింది.

ఊపిరితిత్తులనిండా గాలి పీల్చుకొని రొమ్ము విరుచుకు చూశాడు...ఉషవంక. ఆమెకూడా అలాగే చేసింది. అతను ఠీవిగా నడుంమీద చేతులుంచాడు. ఆమె అతని చర్యలకి విస్తుపోతూ...అలాగే నడుంమీద చేతులుంచింది. 'తను ఏం చేస్తే అది చేస్తుందా?' అనుకొని ఒక్క సారి "హాయ్ ఉషా" అని గాలిలో ఒక ముద్దు విసిరాడు.

అవతలినుంచి— మరి జవాబు లేదు ...మనిషి జాడా లేదు.

## రహస్య సాగరం

పాప ౧౦




(గత సంచిక తరువాయి)

### 21

ప్రభు—చిన్నా

తిరిగి సాగరం చెప్పసాగాడు...

"ఆ రోజుల్లో తెల్లదొరలు మారు మూల అడవుల్లో కొండల్లో అనాగరిక జాతులవాళ్ళనీ, పాముల్నీ ఫొటోలు తీసుకుపోయి ఇండియా అంతా ఇలాగే ఉంటుందన్న భ్రమ కల్పిస్తుండేవారు.

ఇలాంటి అనాగరిక దేశాన్ని ఉద్ధరిస్తు న్నామని చాటుకుంటూండేవారు. అలాంటి ఫోటోలు తీసుకుపోడానికొచ్చినవాళ్లకు హిరణ్యభూపతి అతిధి మర్యాదలు జరుపుతూండేవాడు. ప్రభు వాళ్లతో వెళ్తూండేవాడు. వాళ్లదగ్గిర్నుంచి ఖరీదైన గొప్ప కెమేరా సంపాదించి విదేశీయులు తీసేలాంటివేతీసి వాళ్లకిస్తూండేవాడు. వాళ్లు మెచ్చుకుంటూంటే కొడుకును చూసి హీరాభూపతి పొంగిపోతూండేవాడు.

ఒకసారి ప్రభు పాలకొండ కొండ లోయల్లో తిరుగుతూ చిన్నమడుగులో ఒక సవర చిన్నదొక్కత్తే జలకమాడుతూంటే ఫోటో తీయడానికివ్యూఫైండర్ కందికానించి చూస్తున్నాడు; కనిపిస్తున్నంత మేరా చిన్నది నగ్నంగానే ఉన్నది, ఎండవడి మేను నిగనిగ మెరుస్తున్నది. ఎరువు జీరకలిసిన కురులు వీపునుంచి జలపాతంలాగ నీటిమీద తేలుతూన్నవి, ప్రభు షట్టర్ నొక్కబోతూన్నంతలో...

సవరచిన్నది రంయిమని దూసుకుపోయి పొదలోంచి విల్లు, అమ్ముతీసి ఎక్కుపెట్టి,

"ఏం దొరా! పొటిగి రాపెత్తుతావా? ఒకదాంతో సూత్తూ మరోటి మూసినావే దానికే కోల గురిట్టినాను తెల్సా?...", అని అంటూంటే ప్రభు బిత్తరపోయాడు.

"ఏం? నిచ్చరబోతున్నావు, సవరది సవరబాస గాకండా నీబాస పలుకుతున్నదనా?"

"ఔను!" అన్నాడు ప్రభు.

"మా యత్త నెరుగుదువా ? ... నువ్వెలా గెరుగుతావులే. అది తెలుగు బాగా నేరిపింది సిన్నప్పుడే నాకు, అప్పుడది మీ బస్తీకి ఓ సిరిమంతుడింటి కెల్తూ, వొస్తూండేదిలే!,...ఏలమానాంటి ఏబ్రాసుల్ని పొటిగి రాపెత్తుతావు మీ ఆడంగుల్ని మానాగ నింసుండబెట్టి పొటువోలెత్తి సీవదొర్లకి సూపి ఆళ్ల బిసకొత్తులూ, దబ్బా మాంవసాలూ దిని, సీసాలుదాగి యెంతబాగా కొవ్వుబట్టినారో సెప్పుకోరాదా? నేదా మాలాంటోళ్లకి మీ బాగ్గెమంతుల్నాగ పాంకుబుసాల్లాంటి బట్టలు గట్టించి నగలెట్టి పొటోల్దీసి సూసొ్కి; మేమే బాగుంతాంవో మీ ఆడంగులే బాగుంతారో? ... ఎల్లు, ఎల్లిపో!—అదెందు సేతో నిన్ను జూత్తుంటే నిన్ను గాయపరసాలని పించదంలేదు—అదేంటోగాని నీతో మాట్లాడాలనిపించుతున్నది, యిసిత్తరం! ముంగి ముచ్చునాంటి నాకు, నీతో శానా సెప్పాలని పిస్తున్నది; నువ్వీ మట్టిమీద బుట్టినోడివనో, నే పలికింది నీకు తెలుత్తుందనో, మరెందుకో?...ఆ యెదవెండి కానుమీద మావోళ్ల పాడుఅ పేచ్చ కనిపెట్టేగదా—మీ పట్టపోళ్లు రెంద్రూపాయలిచ్చి బోలెడంత దినుసు బట్టుకుబోతున్నారు. కావుళ్లకావుళ్లు దాన్నేలు, పప్పులూ,

పళ్ళూ, దుంపా అన్నీను; ఇదేమంత కట్ట మనిపించదుగాని, మీ సిరిమంతులు తుపాకీల్తో సిపాయిల్ని, పోలీసుల్ని కుమ్మకు దీసుకొచ్చి జడిపిస్తున్నారు... ఈ కొండలూ, అడివిలూ పుట్టినప్పుడే మేం వుట్టాం! మేం దున్నుకొంటున్న నేల మాది గాదంట! మాకొండలు మావి కావంట! మేం దుంపా, మొక్కా పెంచితే వాళ్లవంట! ఏంటిది? నీ అమ్మని నీ యమ్మకాదని లాక్కోబోతే నీకెలాగుం టాదో సెప్పు? ... ఎవుడో ఏడ్నుంచో దిగొచ్చి యీళ్లకెవుళ్లకో యిచ్చినాడంట! వంచడానిక ఆడెవడు??...మా అమ్మని మీ కప్పగించం! జీవుడుపోయినా దెబ్బ లాడతాం! అని అంటే మాదేం తప్పు? సెప్పు...ఏం మాటాడవు?..." అన్నది చురచుర చూస్తూ.

నున్నటి రాతిలాంటి తేనెరంగుమేను, జీరాడుతున్న బారెడు కెంపు ఛాయ కలి సిన కురులు, చారెడు కళ్లు, కళ్లల్లో వెన్నెల్లో నల్లత్రాచు మెరిసే మిలమిలా చూస్తున్నాడు ప్రభు.

చిన్నది మళ్ళీ, "ఓ రూపాయకాసుకి బోరమీది గుడ్డపీలికతీసి నుంసుంటాం, మరిన్నికాసులాసపెడితే ఏం పొడిగిరావు లెత్తుకుంటారో యెత్తుకోండి మాదేం పోదు అని మొలగుడ్డలాగేసి నింసుంటాం, జీవు డాదకపోతే ఇది కట్టె! ఈ తోలులో ఏటుంది? అంతా మనసులో ఉంది! ఓయ్ నాటు దొరబాబూ! మనిసి గొప్ప అంతా మనసులో ఉంది...", అని అంటూనే చిన్నది ఛటాల్న ప్రభు రెక్కపట్టుకొని ఒక్క గుంజునలాగింది.

ఆ లాగడంలో ప్రభు చిన్నదాని మీద తూలిపడుతూ పడిపోకుండా అప్ర యత్నంగా గట్టిగా పట్టుకొని తిరిగి చూస్తే గుండె గతుక్కుమన్నది...పెద్ద చింతనాగు, కాటువేయడానికి పడగ పూర్ణించి తోకచుట్టుకొని నిటారుగా నించుని ఉన్నది. మొలనున్న చిన్న రైఫిల్ తీయబోతూన్న ప్రభుచేతిని పట్టు కొని వారిస్తూ "దాంతో యిరోదం పెట్టు కోక!..." అంటూ చిన్నది కొట్టుకుం టున్న ప్రభు గుండెను అదిమిపట్టుకొని, వింటి చివర కట్టిఉన్న ఏదో వేరు తీసి పాముముందు పడేలా విసిరింది. మంత్రించినట్టుగా చింతనాగు పడగదించి ముడుచుకొని జరజరమంటూ చిటికలో మాయమైంది.

"బయంనేదు, పొమ్మని సెప్పితిలే! నిన్ను ఆదుకొన్నాననీ నాగుకి తెలిసిం దిలే, నిబ్బరపడు! దాని సంగతి నీకు తెలీదు. నువ్వుగురెట్టీలోగానే, నిలువెత్తున ఎగిరి కాటేస్తది, నీ బుల్లితుపాకి దాన్నేం సెయ్యలేదు!" అన్నది చిన్నది. అంత భయంకరమైన పామును ప్రభుఎప్పుడూ చూడలేదు. అది యింకా అక్కడున్నట్టే గుండె అదురుతోనే చిన్నదాన్ని వది లించుకొని ఎడంగా జరిగి ముడుచుకు పోతూన్నట్టు నిల్చున్న ప్రభునుచూసి

చిన్నది నవ్వుతూ, "ఏం? సిగ్గేసిందా? ఇలాంటి జెంగిలీ దాంతోనా తాకుడైం దనా? నేక ఆడదాన్ననా?...ఆడా మగా ఎంచుతున్నావా, జీవుడు ఆడదీకాదు, మొగదీ కాదు; అదే అసలు. మిగిలిం దంతా వుట్టిదే, నీలో జీవుడికి నిబ్బరం కోనం పట్టుగున్నానంతే! తమకం అంతా యీ వొంటిదేగాని జీవుడిదిగాదు; ... నేనే నాజూకుదాన్నయితే వొగ్గివోదవా?! ఆ పొదసాటుకి లాక్కుపోయేవోడివి! ఔనా? ... మా అడివి మనుసుడైతే అలాగే జేసును..."

"నిజం చెప్తున్నాను, నాకూ అలాగే అనిపించింది సుమీ!", అన్నాడు ప్రభు నిద్రలో మాటాడినట్టు.

"మరెందుకూరుకున్నావ్?"

"నువ్వొప్పుకోవు — నీకు యిష్టం ఉండదని...!"

"మా మనుసుడు అలాక్కాదు, నా కిట్టం లేకపోయినా బరబరా యీడ్సుకు పోతడు,—ఇప్పుడు నువ్వంటే నాకు యిట్టంగానే ఉంది ! ఎందుకో తెల్సా ? మనిసి గొప్ప మనసులో వుంటాదన్నానే, అది నీకున్నాది; నీ లాంటోడికోసం యెదురు సూత్తున్నాననుకో! అయితే... మీ సదూకున్నోళ్లో, గొప్పోళ్ళో అంతా నీలాంటోళ్లె వుండరులే, ఆ మద్దిన జగ్గ బాబో ఏదో పేరు, అడి మనుసుల్సేత మా ఆడోళ్ళని ఎత్తించుకుబోయి అడవి జంతువుకంటే అన్నేయం సేత్తుంటే, జూసిజూసి మావోళ్ళూరుకోలేదులే— ముక్కలైసీనారు! ... అదుగో ఆకాడ పచ్చంగా గడ్డి యెంతబాగా యెదిగి నాదో!...నా కొప్పుదలే! యిట్టఁవే!..." అంటూ చిన్నది ప్రభు ముఖంలోకి చూసింది.

"మా ఇంటికి తీసుకెళ్ళి పెళ్లాడి నిన్నుంచగలిగితే అలాగే చేద్దును, గాని అలా చేయలేనుగదా మరి..."అన్నాడు ప్రభు.

"పెల్లి! నాకు సిన్నప్పుడే పెల్లి అయి నాది సుమీ! మా సవరోళ్ల పెల్లి, యీ సిన్నదీ, యీ సిన్నోడు జత అని పెద్దోలు బాససేసుకుంటారు, మాకు పెతానఁవూ పెల్లీ ఒకటే; కాని ఏం నాబం ? నావోడు నేడు, ఆడూ మా యత్తా గుడిసెతగలబడి బుగ్గయిపోనారు. మాకు మనువులున్నాయి. అన్న పెల్లాన్ని తమ్ముడేలుకుంటాడు, నా కెవరూ లేరు, నువ్వాడి తమ్ముడంతే ఉన్నావు, మనువాడాకపోతేనేంలే! నా కిట్టఁవే!", అంది చిన్నది.

ప్రభు మాటమారుస్తూ, "మీ దగ్గిర మంత్రాలు, మహిమలూ ఉంటాయంటారు నీకూ తెలుసా? ఆ నాగుకేం మంత్రం వేశావు?", అడిగాడు.

"అలాంటివేవీ మా దెగ్గిర్లేవు...మీ నాగ పుట్టల్లో పాలొయ్యం, పూజెయ్యం, వాటి జాయకనిపెట్టి మసులుతాం. అవి మాకు నేత్తాలు, వాటికీ మాకూ తేడా

పళ్ళూ, దుంపా అన్నీను; ఇదేమంత కట్ట మనిపించదుగాని, మీ సిరిమంతులు తుపాకీల్తో సిపాయిల్ని, పోలీసుల్ని కుమ్మకు దీసుకొచ్చి జడిపిస్తున్నారు... ఈ కొండలూ, అడివిలూ పుట్టినప్పుడే మేం పుట్టాం! మేం దున్నుకొంటున్న నేల మాది గాదంట! మాకొండలు మావి కావంట! మేం దుంపా, మొక్కా పెంచితే వాళ్లవంట! ఏంటిది? నీ అమ్మని నీ యమ్మకాదని లాక్కోబోతే నీకెలాగుం టాదో సెప్పు? ... ఎవుడో ఏడ్నుంచో దిగొచ్చి యీళ్లకెవుళ్లకో యిచ్చినాడంట! వంచడానిక ఆడెవడు??...మా అమ్మని మీ కప్పగించం! జీవుడుపోయినా దెబ్బ లాడతాం! అని అంటే మాదేం తప్పు? సెప్పు...ఏం మాటాడవు?..." అన్నది చురచుర చూస్తూ.

నున్నటి రాతిలాంటి తేనెరంగుమేను, జీరాడుతున్న బారెడు కెంపు ఛాయ కలిసిన కురులు, చారెడు కళ్లు, కళ్లల్లో వెన్నెల్లో నల్లత్రాచు మెరిసే మిలమిలా చూస్తున్నాడు ప్రభు.

చిన్నది మళ్ళీ, "ఓ రూపాయకాసుకి బోరమీది గుడ్డపీలికతీసి నుంసుంటాం, మరిన్నికాసులాసపెడితే ఏం పొటిగిరావు లెత్తుకుంటారో యెత్తుకోండి మాదేం పోదు అని మొలగుడ్డలాగేసి నింసుంటాం, జీవు డాడకపోతే ఇది కట్టె! ఈ తోలులో ఏటుంది? అంతా మనసులో ఉంది! ఓయ్ నాటు దొరబాబూ! మనిసి గొప్ప అంతా మనసులో ఉంది...", అని అంటూనే చిన్నది ఛటాల్న ప్రభు రెక్కపట్టుకొని ఒక్క గుంజునలాగింది.

ఆ లాగడంలో ప్రభు చిన్నదాని మీద తూలిపడుతూ పడిపోకుండా అప్రయత్నంగా గట్టిగా పట్టుకొని తిరిగి చూస్తే గుండె గతుక్కుమన్నది...పెద్ద చింతనాగు, కాటువేయడానికి పడగ పూర్ణించి తోకచుట్టుకొని నిటారుగా నించుని ఉన్నది. మొలనున్న చిన్న రైఫిల్ తీయబోతూన్న ప్రభుచేతిని పట్టుకొని వారిస్తూ "దాంతో యిరోదం పెట్టు కోక!..." అంటూ చిన్నది కొట్టుకుంటున్న ప్రభు గుండెను అదిమిపట్టుకొని, వింటి చివర కట్టిఉన్న ఏదో వేరు తీసి పాముముందు పడేలా విసిరింది. మంత్రించినట్టుగా చింతనాగు పడగదించి ముడుచుకొని జరజరమంటూ చిటికలో మాయమైంది.

"బయంనేదు, పొమ్మని సెప్పితిలే! నిన్ను ఆదుకొన్నాననీ నాగుకి తెలిసిందిలే, నిబ్బరపడు! దాని సంగతి నీకు తెలీదు. నువ్వగురెట్టిలోగానే, నిలువెత్తున ఎగిరి కాటేస్తది, నీ బుల్లితుపాకి దాన్నేం సెయ్యలేదు!" అన్నది చిన్నది. అంత భయంకరమైన పామును ప్రభుఎప్పుడూ చూడలేదు. అది యింకా అక్కడున్నట్టే గుండె అదురుతోనే చిన్నదాన్ని వదిలించుకొని ఎడంగా జరిగి ముడుచుకుపోతూన్నట్టు నిల్చున్న ప్రభునుచూసి

లేదు, ఆటికాట్లకి ఇరుగుళ్లు మాకుతెల్సు, కొన్ని ఏర్లు, ఆకులూ, ఆటివాసనలూ ఆ పురుగు కెలాగుంటాయో, ఏమను కుంటాయో మాకు తెల్సు. ఇందాకిసిరి నానే ఆ తీవదానికి అంచనా, ఎల్లి పొమ్మంటున్నానని; దాన్ని నీ దెగ్గి రుంచుకో, యెందుకేనా మంచిది..."

"అవి మీకు నేస్తాలన్నావు, మీతో నేస్తం కట్టినవాళ్లనీ ఏం చెయ్యవుగదా?"

''మాకవి నేస్తాలే...పోతే మీ వాసనే ఆటికి గిట్టదు. మీ బస్తీ యీదుల్లో మమ్మల్నిజూసి కుక్కలు అరుత్తాయే, అలాగ. ఆటికీ బయం మీరేం జేత్తారో అని; ఆటికీ తెలుసు, దొంగనేస్తాలెవుళ్లో, నిజం నేస్తాలెవుళ్ళో నిజంగా మాకు నేస్తాలైనోళ్లని చూసి దూరదూరంగా పోతాయంతే!"

"అయితే నన్ను నీ నేస్తంగా చేసుకో!..." అన్నాడు ప్రభు.

"నీ నేస్తానికి నమ్మకం ఏంటి?"

"ఇదుగో! ఈ కెమారాని నీముందరే పారేసిపోతా ... '', అంటూ ప్రభు కెమేరా నేలకేసి కొట్టబోయాడు.

"వొద్దు, అది శానామంచిది, నిజం నిజంనాగే ఎత్తుతాది, దాన్ని పట్టుగు నోడు కూడ నిజం సూడాల! మా అడివోళ్లు, కొండోళ్లు ఎంత నిజంతో బతుకుతున్నారో దాంతో సూపెట్టు! అలా మాటివ్వు!"

"అలాగే మాటిస్తున్నా. నీ పేరేంటో?..." అన్నాడు ప్రభు.

"నా పేరడిగినావెందుకూ?...సిన్నా నాపేరు సిన్నా!", అన్నది చిన్నది.

"అందే చిన్నా అన్నమాట; నేస్తం అన్నాక పేరు తెలుసుకోవద్దూ మరి.."

"మర్నీ పేరో?'', అడిగింది చిన్నా.

"నువ్వే పలకలేవు—ప్రభు!..."

"పెబు—పెబు...", అంది చిన్నా.

"లేకపోతే 'దాసు' అను. నా పూర్తి పేరు ప్రభుదాస్!"

"అబ్బే, దాసేంటి దాసు, దాసు డ్నాగ, పెబు అంటానులే!"

"అలాగే అను, చిన్నా! నీ నేస్తం నేస్తానికి గుర్తుగా యిచ్చాడనుకో, యిది నీ దగ్గిరుంచు!'' అంటూ ప్రభు మెడ లోంచి రవ్వల పతకమున్న గొలుసుతీసి యివ్వబోతే,

"వొద్దు...అలాంటిది మేం ముట్టం, అది బంగారం! తగూలమారి, తంటాల మారి...'', అంటూ చిన్నా వారించింది.

"పోనీ, వెండికాసులు...'' అంటూ ప్రభుజేబులోంచి దీయబోతూంటే చిన్నా వద్దన్నట్టు తల అడ్డంగా ఆడిస్తూ," ఇచ్చి పుచ్చుగుంటాంగాని నేస్తానికైనా ముందుచ్చుగోం!'' అన్నది.

"అలాగైతే ఏమిస్తావో ఇయ్యి మరి!"

"నీకోసం మంచి తేనె వెదురుబొంగు నిండా నింపి ఉంచుతా..."

"మళ్లీ రమ్మంటున్నావన్న మాట, వస్తాలే! ... యిక్కడికే గదూ? ... చిన్నా. ఒకటడుగుతాను, చెప్పు! చాలా సంగతులు చెప్పావు, ఇన్నిమాట లెలా గనేర్చావు, ఎవరు నేర్పారు?" కుతూహలంగా అడిగాడు.

"తాత్రాజు...తాత్రాజు నెరగవూ?" అన్నది చిన్నా.

తాత్రాజన్న మాటకు ప్రభుగతుక్కుమంటూ, "తాత్రాజు! పెద్దదొంగ, దోపిడీదారు కదూ!!" అన్నాడు.

"తాత్రాజుని దొంగన్నవాళ్లే దొంగలు! మీ గొప్పోళ్లందరూ దొంగ అంటారు, అంటే అనుకోండి; మా తాత్రాజు తనకోసం దొంగతనాలు, దోపిళ్లూ సెయ్యడు, అంతా వంచుతాడు, సిల్లిగవ్వ ఉంచుకోడు. మాకు తండ్రి నాంటోడు, అన్నలాంటోడు. ఎవళ్లు కటకటపడుతున్నా సూళ్లేడు. తాత్రాజె లాగ నడుసుకోమంటే అలాగ నడుసుకుంటాం! తాత్రాజు మాటలు యింటూ వుంటాను, అబద్దాలు సెప్పదు, తాత్రాజు దగ్గిర నాకెంత సనువనుకున్నావు, బాబయ్యా అంటూ తిరుగుతాను, నామీద సాలా దయ, సిన్నతనం నుంచీ నేనంటే ఎంతో ముద్దు..."

"సిన్నా! తాత్రాజుని నాకు చూపిస్తావా?"

"ఏం? పట్టుగుంటావా? నువ్వేం పని కొస్తావు ఆడిదగ్గర, ఆడ్ని పట్టిచ్చాలని శానా పన్నాగాలు పన్నుతారేగాని, మీలాంటోళ్లకి కనిపించడు; కనిపించినా దొరకడు..."

"అందుగ్గాదు సిన్నా..., చిన్నా! ఒకటి మాత్రం నమ్ము! ఏటవాలుగా పడుతున్న ఎండ నీళ్లమీద మిలమిల మెరుస్తూంటే, చుట్టూరా పొదలు, జీవం లాగ నువ్వు అంతా చూడ్డానికెంతో ముచ్చటగా కనిపిస్తూంటే ఫోటో తీద్దామనిపించింది, అంతే! మరేం అనుకోకు, ...మరి వస్తా..."

"నేనేం అనుకోన్లే—ఇప్పుడు ఫోటో తీసుకో! నీ నేస్తాన్నే గదా!" అంది చిన్నా.

"ఇప్పుడుగాదులే, ఎండపోయింది... వస్తాను మరి..." అంటూ ప్రభు వెనుదిరిగిచూస్తూ చూస్తూనే వెళ్లాడు; అటే చూసిచూసి చిన్నా పైన నారగుడ్డ కప్పుకొని, నీళ్లకడవ నెత్తుకొని విల్లమ్ముల‌తో పొదల చాటుల్లో మాయమైంది.

ఆవిధంగా ప్రభుకి ఆ సవర చిన్నదానితో పరిచయమైంది. అంతటితో ప్రభు కెమేరా విడిచిపెట్టేశాడేగాని, ఆ చిన్నది మాత్రం మనసుని విడిచిపెట్ట లేదు; చిన్నా చెప్పిన మాటలు నెమరు వేసుకోవడంలో పాము పడగవిప్పినట్టు ఏవో కొత్త సంగతులు తెలిశాయి. తలుపులు బార్లా తెరుచుకొని కొత్తలోకం



కనిపించినట్టయింది. తరుచు అదేపనిగా కొండల్లోకి వెళ్తూండేవాడు, చిన్నా కోస మనేకాదు, కాని ఆ చిన్నదికూడా కలు స్తుండేది. కొండ దొరలతో, ఆటవికు లతో స్నేహం పెంచుకొన్నాడు, వాళ్ల గురించి చాలా తెలుసుకున్నాడు.

హిరణ్యభూపతి కొడుకు తిరుగుడూ, కొండవాళ్లతో చెలిమినీ తెలుసుకున్నాడు. నవరచిన్నదానితో తగులాటమూ ఉన్న దనీ విన్నాడు హిరణ్యకశిపుడిలాగ మండిపోయాడు

హీరాభూపతికి కొండవాళ్లన్నా ఆటవికులన్నా మండిపడ్డానికి మరో కారణం కూడా ఉంది!

హీరాభూపతికి జగన్నాధ భూపతి అనే తమ్ముడుండేవాడు. జగ్గభూపతి అని పిల్చేవారు. అన్నదమ్ములిద్దరూ సాక్షాత్తూ హిరణ్యాక్ష, హిరణ్యకశిపు ల్లాంటి వాళ్లు అనేవారు. ఆటవికుల దగ్గి ర్నుంచీ, కొండవాళ్లనుంచీ నామ మాత్రపు చౌకధరకు దినుసుల్ని రాబట్టు కొని వాటితో విశేషలాభానికి వ్యాపారం చేస్తూండేవారు హిరణ్యభూపతి గడింపు అంతా అటువంటిదే. చిన్నచిన్న అప్పులు యిచ్చి, వడ్డీలు కట్టి దినుసుల్నీ, జాగాల్నీ సొంతం చేసుకుంటూండేవాళ్లు. ఇలాంటిదంతా చూసుకోడానికి జగ్గ భూపతి కొండల చేరువ అడివిలోనే చిన్న బంగళాలో ఉండేవాడు. తుపాకీ పట్టి వేటాడుతూండేవాడు. ఆ జగ్గ భూపతి ఒకనాడు వేటకు వెళ్లినవాడు తిరిగిరాలేదు. ముక్కూ, మొహమూ ఆనవాలు లేకుండా చిత్తుచిత్తు అయి పోయాడు. కుడిభుజం లాంటి తమ్ముడి మరణంతో హిరణ్యభూపతికి ఆటవికు

లన్నా కొండవాళ్లన్నా తీరని పగ, ద్వేషమూ ఏర్పడ్డాయి.

ఆగ్రహావేశంలో భార్య లీలావతితో హీరాభూపతి..."సవరదాని పాలు తాగి పెరిగిన బుద్ధి పోనిచ్చుకున్నాడు కాదు నీ కొడుకు! చెడబుట్టాడు...", అంటూ యింకా ఎన్నో అన్నాడు.

ప్రభు చెవిని పడకూడని ఆ ఒక్క మాట ఎలాపడిందో, ఎక్కడ పొంచి ఉండి విన్నాడో,...పడనే పడింది!

ప్రభు తల్లి లీలావతిని నిలదీసి అడిగాడు, "అమ్మా! నీ పాలుతాగి నేను పెరగలేదా?!" అని.

లీలావతి ముక్కుసూటి మనిషి, నిజం దాచినా ప్రభు ఎలాగైనా తెలుసుకోగలడుకూడా; చెప్పక తప్పిందికాదు.

"ప్రభూ! నేను నీకు పాలిచ్చి పెంచలేదు. ఒక సవర మనిషి నీకు పాలదాదిగా చాలాకాలం పాలుపెట్టింది. దాని పాలు నీకు బాగా సరిపడ్డాయి. ఆవు పాలూ, గుండపాలు నీకు పనికొచ్చాయి కావు. డబ్బాపాలు అంత వాడేవారుకారు గూడా. అప్పట్లో నా ఆరోగ్యం అంత బాగుండలేదు, అంతేగాకుండా అందం కూడా చెడుతుందని నీకు పాలు పెట్టనివ్వలేదు మీ నాన్నగారు. ఆ రోజుల్లోనే నాతో ఇంగ్లాండు ప్రయాణం కూడా పెట్టుకొన్నారు కూడ...

చాలారోజులు దాని పాలు తాగే పెరిగావు...బతికావంటే సబవేమో..., ఆరోజుల్లో అందరు శ్రీమంతుల్లాగే నెలకు పదిరూపాయలు, ఒక చీరె యిచ్చి ఆ సవర మనిషిని పాలదాదిగా పెట్టుకున్నాము..."

"ఆ పాలతల్లి ఎవరు? ఎక్కడుంది? ఉందా?!" అడిగాడు ఆతృతగా ప్రభు.

"లేదు! ... పరవతాయి అని పిల్చేవారు దాన్ని; గవర్నమెంటువారికి ద్రోహం తలపెట్టే ఒక మూకను మీ నాన్నగారే ఆచూకీలిచ్చి పట్టించారట. ఆ మూకలోనే దాని మొగుడు ఉన్న సంగతి మాకు తర్వాత తెలిసింది...ఆ తర్వాత ఒక సందర్భంలో రిజర్వు పోలీసులకీ ఆదివాసులకీ జరిగిన ఘర్షణలో ఒక గుడిశె తగలబడి పోయిందట. అందులోనే పరవతాయి, దాని కొడుకు ఉండిపోయారట పాపం! ఆ కొడుకు నీకంటే కొంచెం పెద్ద...", చెప్తూంటే లీలావతమ్మగారి కళ్లనుంచి రెండు బిందువులు జారాయి.

"అప్పుడప్పుడు వాణ్ణి తీసుకొస్తూండేది. రెండోనెలకే అంబలి నాకించి అలవాటు చేసిందట. మీ ఇద్దర్నీ ఎత్తుకొని, 'నా కిద్దరు బాబులమ్మగోరూ! పెద్దయ్యాక మీ ఇంటికొత్తే, ఇప్పుడు నా బాబే ... అప్పుడు మీ బాబు ఎంత బువ్వెట్టిత్తాడో, ఎన్ని కాసులిప్పిస్తాడో, నేక మరిసేపోతాడో! మరిసిపోనివ్వవు లెండి నానెట్టిన పాలు...' అనేది. అది నిన్ను ఎంత యిదిగా చూసుకొనేదను




కున్నావ్!..." చెప్తూనే లీలావతమ్మ కళ్లు ఒత్తుకుంది.

లీలావతి అమాయకురాలు. ఏది చెప్పవచ్చునో, ఏది కూడదో అనే ఆలోచనే లేకుండా చెప్పేసి తర్వాత నాలిక్కరుచుకుంది.

ప్రభు ఒక్క క్షణం ఆగకుండా కొండలోయకు హుటాహుటిని వెళ్లాడు; చిన్నా! అని కేక వేశాడు. చిన్నా వచ్చింది.

"సిన్నా! నువ్వు నాకు వదినవు. వదిన మాకు తల్లితో సమానం ఎంత సంతోషంగా ఉంది సిన్నా! నువ్వు వదినెవు...అన్న భార్యవు చిన్నా!..." ఏదో పెన్నిధి దొరికిన వాడిలాగ సంతోషంతో ఉక్కిరిబిక్కిరి అవుతూ ప్రభు చెప్తున్న దేమిటో చిన్నాకి అర్థం కాలేదు...తర్వాత్తర్వాత అంతా తెలుసుకుంది.

లీలావతి చాలా అందంగా హంస బోరతో రాయంచలాగే ఉండేదట. ఆమె పాదాలు నేలతాకితే కందిపోతాయేమో అన్నంత జాగ్రత్తగా చూసుకుండేవాడట భూపతి. సీమ నుండి అచ్చసీమరాణిలాగ చేసి తీసుకొచ్చాడట. తెల్లని ఉల్లిపొర ఆర్గండీ దుస్తులతో నడుముచుట్టూరా బిగించిన వెడల్పాటి ఎర్రని పట్టుపట్టీతో బోరవిరుచుకొంటూ స్వర్గలోకం నుంచి దిగిన రాజహంసలాగే ఉందట ... ఇవన్నీ తర్వాత ప్రభు వేరుగా, తెలిసినవాళ్ళు చెప్పగా తెలుసుకున్నాడు.

అన్నీ తెలిశాక, ప్రభులో ఎలాంటి భావాలు కలిగాయో మరి...పూర్తిగా మారిపోయాడు. ఆ మార్పు ఎంతవరకూ దారి తీసిందంటే..." అని సాగరం చెప్పబోతూంటే అమ్ము నిద్రలేచి పాల కోసం ఏడుపు మొదలెట్టింది గోదావరి అమృతలక్ష్మి పక్కకు చేరింది ఆవులిస్తూ.

"తర్వాత విందువుగానిలే ..." అంటూ సాగరం లేచాడు.




ఇల్లంతా బోసిగా వుంది.

సాయంత్రం ఎనిమిది అయ్యింది. మిత్రుడు ఇంత దాకా మాట్లాడి వెళ్ళిపోయాడు. శ్రీమతి, పిల్లలు సినిమాకెళ్లారు. ఇంకా రెండు గంటలు కావాలి వాళ్లురావటానికి. అప్పటిదాకా యింట్లో ఏకాకిగా గడపటం బాధగానేవుంది

రేడియో ఆన్ చేశాను. ఏదోసంగీతం మళ్ళీ ఆఫ్ చేశాను

ఏదైనా పుస్తకం చదవాలని అలమారలో పుస్తకాలు వెదుకుతున్నాను.

టెలిఫోన్ మ్రోగుతూవుంది

రిసీవర్ అందుకొని "ఎవరూ?" అన్నాను.

"నేను సేట్ మదన్‌లాల్‌ను మాట్లాడుతున్నాను. ఇవ్వాళో కేసు జరిగింది వకీలు సాబ్. నాదగ్గర రిక్షా కిరాయకు తీసుకపోయే ఒకడు నాకు ఎదురు తిరిగాడు. రెండేళ్ళ నుండి వాడు నా వద్ద రిక్షా కిరాయకు తీసుకెళ్తున్నాడు. ప్రతి నిత్యం కిరాయ తెచ్చియిచ్చేవాడు. ఈ మధ్య పదిహేను రోజులనుండి వాడు కనిపించటంలేదు. కిరాయ కూడా తెచ్చి యివ్వటంలేదు. యివ్వాళ్ళ ఎక్కడో కనిపిస్తే మా జీతగాడు వాన్ని పట్టి తెచ్చాడు. వాడు రిక్షా ఎక్కడో పెట్టి వట్టి చేతులతో వచ్చాడు."

"వింటున్నారా వకీలు సాబ్ ఊఁ కొట్టటం లేదు?"

"ఊఁ" అన్నాను.

"కిరాయ యివ్వమంటే లేదన్నాడు. రిక్షా తెచ్చివ్వమంటే తేనన్నాడు. రెండు సంవత్సరాల కిరాయ కట్టాను. రిక్షా ఖరీదు కంటే డబ్బులిచ్చాను. ఇంకా రిక్షా యివ్వనన్నాడు. కిరాయ ఇవ్వనన్నాడు. నాకుకోపమొచ్చిలోపలేసి తన్నించాను."

"వకీలుసాబ్ పోలీసు స్టేషన్ లో రిపోర్టిస్తానని వెళ్లాడు వాడు బ్రతుకుతాడో చస్తాడో కాని రిపోర్టిస్తాడట వెధవ. నన్ను పట్టుకొని రిమాండ్‌లోవేస్తే విడిపించు సబ్ ఇన్స్పెక్టర్‌కు నేను కొంత పారేస్తాను కాని... ఈ కేసు నీవు తీసుకోవాని రిక్షా రావాలి...వాడు కోర్టుకు తిరిగి తిరిగి చావాలి... వింటున్నారా వకీలు సాబ్."

"మీకే నంబరు కావాలండీ!" అడిగాను.

"264 వకీలు రామనాధం కావాలి."

"రాంగ్ నెంబర్. దిస్ ఈజ్ 364."



# చాంద్రాయణం

రైలు నడుస్తోంది. ఆ పెట్టెలో వున్నది చంద్రబాబు ఒక్కడే. చుట్టుపక్కల మరొకవ్యక్తి అంటూ ఎవరూ లేకపోయినా అనేకవేల ప్రజల మనోభావాలు బొత్తులుబొత్తులుగా పడి ఉన్నాయి. రకరకాలసిరాలతో, రకరకాల కాగితాలమీద-రకరకాల భాషల్లో రచింపబడివున్న సహస్రవిధ మనోభావాలవి.. ఎటుచూసినా నిశ్శబ్దమే - కాని బైట కొంచెం చినుకుమాత్రం రాలుతోంది... కారుచీకటి ... స్వప్నవీథిలో విహరించ తలచుకునేవారికి మంచి విలువైన సమయం. చంద్రబాబు నిద్రజోగుతున్న కళ్ళతో రెండాకులకు సున్నంరాసి వేసుకున్నాడు. కోటుజేబులోంచి జరదాడబ్బీ తీసుకుని, ఒకటి రెండుసార్లు దానిమీద చిటికతోకొట్టి, మూతతీసి, రవంత జరదా బుగ్గను బిగించాడు...కిటికీతలుపు పైకి యెత్తి ఒకటిరెండుసార్లు ఉమ్మేశాడు. బైటగాలి జోరుగా ఉండటంమూలంగా మళ్ళీ కిటికీతలుపు మూయక తప్పింది కాదు. స్వప్నజగత్తులో విహరిస్తున్న చంద్రబాబు మళ్ళీ తనస్థానంలోకి వచ్చి కూర్చున్నాడు. అతడు వస్తుతః నెమ్మదయినవాడు: ఇటు వటూ _ అటూ విటూ చెల్లాచెదురుగా పారేసి, హడావిడిచేసే రకం కాదు తాను చేయతలచుకున్నది తాపీగా చేసేరకం...అయిదు ఉత్తరాలు మాత్రం యేరి తీసివాటిని ఒకవైపున పెట్టాడు. అన్ని ఉత్తరాలూ చదవటానికి తగిన అవకాశం లేదతడికి...ఉద్యోగ ధర్మం కూడా నిర్వర్తించుకోవాలిగా

ఒకపక్క...! తీరికవుంటే చంద్రబాబు అన్నీ కాకపోయినా ఇంకా మరికొన్ని ఉత్తరాలైనా తప్పకచదివేవాడు. అలా చదవటం అంటే అతడికెప్పుడూ సరదా యేకాని విసుగంటూ లేదు. కవర్లను జాగ్రత్తగా ఊడదీసి, మళ్ళీ నేర్పుగా అతికించటానికి అవసరమైన సామగ్రి యావత్తూ సమకూర్చుకోవటమే కాదు- అతడెప్పుడూ వెంట ఉంచుకునే వాడు. చంద్రబాబు ఆ ఉత్తరాలను అటూ ఇటూ తిప్పి పరిశీలనగా చూసి, తనపని ప్రారంభించాడు.

*  *  *

చంద్రబాబు పడుచుతనంలోవున్న యువకుడూ కాడు, పండు ముసిలీ కాడు. ప్రౌఢవయస్కుడు. ఉద్యోగం లెఖ్ఖ ప్రకారమయితే అతడి కిప్పుడు నలభై యేనిమిదేళ్ళు. కాని ఆ లెఖ్ఖ అబద్ధం. అతడప్పుడు యెన్ని యేళ్ళు తగ్గించుకుని చెప్పుకున్నాడోకూడా చెప్పటం కష్టం. ఆనాటి సంగతులు తెలిసినవాళ్ళెవరూ యిప్పుడు భూమ్మీద లేరు. పోనీ ముఖం చూసి చెప్పకూడదా అన్నా చెప్పటం అంత తేలిక్కాదు. మీసాలు నెరవటం మొదలెట్టినప్పటినుంచి వాటికి రంగు వేస్తున్నాడు. మూడో భార్య - మాధురి- యెదుట సమాధానం చెప్పటం చేతకాని అసమర్థుడు కాడతడు. వయస్సు యెంత అయితే యేంకాని, చంద్రబాబు మాత్రం మహా రసికుడు. చిన్నప్ప ట్నుంచీ రసపిపాసువే. నిజానికి గణాలు పేర్చి అతడెప్పుడూ కవిత్వం రాయ లేదనుకోండి— అసలలాంటి మిడిమిడి కవిత్వాలవల్ల అతడికి సంతృప్తి లేదు. కవిత్వంరాస్తే ఏం లాభం? ఆ కవితా రసాన్ని ప్రత్యక్ష జీవితంలో ఆస్వాదిం చటమే ముఖ్యంగా కావాల్సింది. అది అతడు చాలాసార్లు చేశాడు-చంద్రబాబు యెంత ఆసక్తితో- యెన్ని శ్రమలకోర్చి నూతన దంపతుల శోభనగృహంలోకి చాటుగా దూరి వారి రహస్య సంభాష ణలు విన్నాడో, దొంగలాగా ఎన్ని శోభ నపు గదుల కిటికీందగ్గిర పొంచివుండి చెవి ఒగ్గేవాడో, ఎన్నిసార్లు తలుపు సందులోంచి తొంగి తొంగి చూశాడో- వాటికి అంతులేదు. ఆ గాథలన్నీ అతడి మేనమామ కొడుకుంటే చెప్పేవాడే. మిసమిసలాడే యౌవనంలో వుండగా కవిత్వంకూడా మిణికాడుట! కాని ఆ సంగతి అప్పటి అతడి డాక్టర్లకి, చచ్చి పోయిన అతడి భార్య లిద్దరికీ తప్ప యింకెవరికయినా తెలుసునేమో మనకు మాత్రం తెలియదు. 'యాదృశీ భావనా యస్య సిద్ధి ర్భవతి తాదృశీ' అన్నట్లు భగవంతుడుకూడా అతడికి చిత్రమైన వుద్యోగమే వచ్చేట్లు చేశాడు.

ఆర్. యమ్. యస్. సార్టర్ చంద్ర బాబు

అందు చేతనే అతడికి ఎంతో కవి త్వాన్ని అనుభవించే సదవకాశం లభిం చింది, లభిస్తోంది, లభిస్తుందికూడా.

చంద్రబాబు - కవర్లలో చిత్రవిచిత్రాలు యెన్నో చూసివున్నాడు. అవి యెంత తమాషాగా-యెంత అద్భుతంగా వుండే వని; పెద్ద పెద్ద డిగ్రీలతో లెటర్ హెడ్స్ వేయించుకునే మేధావులందరూ తమ భార్యలకు - భార్యలవునో కాదో భగ వంతుడికే తెలియాలి-యెంత అశ్లీలమైన భాషలో వుత్తరాలు రాస్తారో పైకి వుచ్చ రించలేము. చదువుకోటానికి మాత్రం మహా మజాగా వుంటాయి.

మొదట్లో చంద్రబాబు ఆడవాళ్ళ దస్తూరితోవున్న కవర్లు తీసి చూసేవాడు- యిప్పటికీ అప్పుడప్పుడు ఒకటి-రెండూ తీసి చూస్తూవుంటాడు. కాని ఆడవాళ్ళు రసవత్తరంగా వుత్తరాలు రాయలేరని చంద్రబాబు అనుభవం...సాధారణంగా 'నేను కులాసాగానే వున్నాను. మీ రెలా వున్నారు?' ఇలాంటి మామూలు మాటల తోనే నిండి వుంటాయి. మహా వుంటే "మీరు లేకపోవటంవల్ల నా మనస్సు యెలాగో వుంది. ఎప్పుడొస్తారోమరి!'... ఇలాంటి మాటలక్కడక్కడ వుంటాయి. చివరమాత్రం 'జవాబు జరూరు. నమ స్కారములతో...' అని వుంటాయి. ఇందులో వర్ణక్రమం తప్పులు యిహ అడగక్కర్లేదు. 'ముద్దులతో...' అని కూడా కొన్నింటిలో లేకపోలేదు కాని చాలాభాగం చెత్తవుత్తరాలే...ఎప్పుడూ యేవొక్క రసికురాలి వుత్తరమూ అతడి కంటపడలేదని కాదు చెప్పటం!...ఆ ఆశతోనే యిప్పటికీ వొకటి-అరా ఆడ వాళ్ళ వుత్తరాలుకూడా అప్పుడప్పుడు తీసి చూస్తూవుంటాడు. కాని కదాచిత్తుగా గాని అలాంటి వుత్తరం కంటపడదు- ఒక రోజున యిలాంటి వుత్తరం ఒకటి తీస్తే అందులో యే యే వస్తువులు కొనుక్కురావాలో పెద్ద జాబితా దొరి కింది. వుత్తరం అన్న పేరేకాని అంతా జాబితాయే. భర్తకు రాస్తున్నట్లు లేదది- బజారులో కొట్లో గుమస్తాకి చీటీరాసి పంపుతున్నట్లుంది. ఆడవాళ్ళు సరసంగా ఉత్తరాలు రాయలేరనేది చంద్రబాబుకి పూర్తిగా అనుభవమైన విషయం.

కవరుమీది విలాసం ఆడవాళ్ళదై వుండి, ఆ దస్తూరి మగవాళ్లదికనుక అయితే చంద్రబాబు శరీరం పులక రించేది. మగవాళ్ళ ఉత్తరాల్లోనే మజా అయిన సంగతులుంటాయి. కాని ఇక్కడ కూడా చంద్రబాబుకు కొంత నిరు త్సాహం కలగక తప్పేదికాదు. బెంగాలీ- ఇంగ్లీషు తప్ప అతడికి మరోభాష రాదు. మగవాళ్ల దస్తూరీలో ఉన్న ఉత్తరాలు తీసినా వాటిల్లో కొన్ని హిందీలోనో మరే భాషలోనో ఉండేవి. అదీగాక అది తండ్రి కూతురుకు రాస్తున్న ఉత్తరమో కొడుకు తల్లికి రాస్తున్న ఉత్తరమో... తెలియదు. ఏది ఎలాఅయినా మగవాళ్ల ఉత్తరాలయితేనే చంద్రబాబు ఎక్కువ రసాస్వాదన చెయ్యకలిగేవాడు. మరీ రసవత్తరమైన ఘట్టాలుంటే ఒక నోటు

బుక్‌లో కాపీచేసుకుని ఉంచుకునేవాడు. మగవాళ్ళు సిగ్గులేనివాళ్ళు. వాళ్ల కలం ఎన్నివిధాలయినా పరుగెత్తుతుంది. అదీ గాక వాళ్ళకేం? భయమా! బందలా! మగవాళ్ల దస్తూరీలో ఉన్న కవరులోనే అతడికొకసారి వందరూపాయల నోటు దొరికింది. పాపం, ఎవరో అభాగ్యుడు ప్రియురాలికి రహస్యంగా పంపుతున్నాడు! నూరురూపాయలనోటు దొరికింది ఒకసారే కాని, ఫొటోలు మాత్రం చాలాసార్లు దొరికాయి. ఆ ఫొటోలతో ఒక ఆల్బమ్ నిండిపోయింది. ఆడవాళ్ల దస్తూరితోఉన్న ఉత్తరాలనుకూడా ఒక కంట కనిపెట్టకుండా పూర్తిగా చెయ్యిదాటి పోనీయకూడదు. ఒకసారి ఒక ఉత్తరంలో పెదవుల గుర్తులు కన్పించాయి. అయినా చంద్రబాబుకు మగవాళ్ల ఉత్తరాలంటేనే మహా ఆసక్తి!

* * *

చంద్రబాబు విడిగా తీసి ఉంచుకున్న అయిదు ఉత్తరాల్లో ఆడవాళ్ళ దస్తూరీతో వున్న మొదటికవరు ఊడతీసి చాలా నిరుత్సాహపడ్డాడు. అయినా చదవటం మొదలెట్టాడు.

"దీదీ;

నీ రిప్లయికార్డు నిన్ననే చేరింది. నువ్వు రిప్లయికార్డు రాయటం నీకు సిగ్గుగా తోచకపోయినా నాకుమాత్రం చాలా సిగ్గుగావుంది. ఇక్కడ అన్నివిషయాలూ సర్దుబాటు చేసుకోవలసింది నేనేనని నీకు తెలుసుగా! నాన్నగారు ఏ విషయమూ పట్టించుకోవడంలేదు. అదీగాక ఈ ఉద్యోగం మూలంగా నాకు ఒక్కక్షణం కూడా తీరికలేకుండావుంది. అయినా నీ ఉత్తరం ఇంకా రెండురోజులకు వస్తుందనగా గదాధరుణ్ణి కంసాలిగగ్గిరకు పంపాను. నీ నగలు తయారయినాయి. నేను వారంరోజులక్రిందట వెళ్ళినప్పటికే నీ చెవుల దుద్దులు చెయ్యటం పూర్తి అయింది. మొన్న శనివారంనాడు మళ్ళీ వెళ్ళాల్సిందసలు నేను. కాని తీరిక లేకపోయింది. స్కూల్లో బహుమతులు పంచిపెట్టాల్సిన పనితొందరలో ఉండిపోయాను. 'గరల్స్ సెక్షన్' బాధ్యత యావత్తూ నామీదవుంది. ...నీ నగలు ఇవాళే పంపుతున్నాను... నీ దుద్దులు మాత్రం నేను చూశాను. చాలా బాగున్నాయి. మిగతావాటి సంగతి చెప్పలేను. వాటినికూడా తీరుబడిగా చూసేందుకు అవకాశం చిక్కలేదు. ఇహముందు ఇలాంటి కటువైన ఉత్తరాలు రాసి, నా మనస్సును బాధపెట్టవద్దని ప్రార్థిస్తున్నాను.

—సమిత"

చంద్రబాబు అలవాటుప్రకారం—అత్తరువాసనేమైనా కొడుతుందేమో అని—ఆ ఉత్తరాన్ని వాసన చూశాడు. కళ్లుమూసుకున్నాడు. భావనాదృష్టితో—క్రోధకంపితాధర అయిన ఒక స్త్రీ




ముఖాన్ని చూడటానికి ప్రయత్నించాడు. కాని అతడి మానసపటంమీద మాటి మాటికీ కన్పించిన రూపం అతడికి సుపరిచితురాలైన ఒక పంతులమ్మది. మెడనరాలూ చెక్కిళ్ళు ఉబ్బి, చిక్కి శల్యమై, నల్లగా అసహ్యంగా ఉండే స్త్రీరూపం అది...కత్తిలాంటి ముక్కు....

చావనీ—తనకెందుకు?

చంద్రబాబు రెండో ఉత్తరంతీశాడు,

"......

నీ ఉత్తరం అందింది...బియ్యంధర మణుగు నలభైరూపాయలు దాటింది. పప్పుల ధరలు మండిపోతున్నాయి. కూరలు, కట్టెధరలూ చూసినా అలాగే ఉన్నాయి. నూనె మూడురూపాయలు. నెయ్యిధర అడగడానికి ఆస్కారం లేకుండాఉంది. మామూలు పంచెలచాపు ఏదిచూసినా పదిరూపాయలకు తక్కువ లేదు అయినా నెలకు సరిపడ వెచ్చాలన్నీ ఎలాగో అలా కొంటూనేఉన్నా. కాని అన్నీ నగదు యిచ్చి కొనలేక పోతున్నా. నీలాంబరుడి కొట్లో అప్పు చాలా పెరిగింది. అప్పుచెయ్యక తప్పేదేముంది? నవీనుడికి ఇరవైరూపాయలు పంపించాల్సి వస్తోంది. నా ఒక్కడివల్ల ఎలా అవుతుంది చెప్పు? ఇలాంటి గడ్డు రోజుల్లో ప్రెటికోట్ వేసుకోకపోతే జరగదూ నీకు? దానికోసమని అమెరికన్ క్లాత్ అప్పుచేసి మరీకొన్నావా? నేనేం మొగలాయీ నవాబుననుకుంటున్నావేమిటి? మా యజమానిచేత రోజూ చీవాట్లూ చెప్పుదెబ్బలు తప్పటంలేదు. అయినా అతడు నాకేం వెయ్యీ—ఐదు వందలూ ఇవ్వటంలేదు. ఇస్తున్నది డెభై అయిదు రూపాయలు. ఈ సంగతులన్నీ నీకు ఎన్నిసార్లని జ్ఞాపకంచెయ్యను? నా స్థితిచూద్దామా నాకు బొమికెలు బైట పడ్డాయి—"

పాపం! ఎంత ఆపద!—

చంద్రబాబు కనుబొమలు చిట్లిస్తూ ఆ ఉత్తరం కవరులో పెట్టేశాడు. ఆ వ్యక్తి నాలుగు పేజీలనిండా— ప్రత్యక్షరంలో ఆకలి వెళ్ళగ్రక్కుతూఇలాంటి సంగతులే రాశాడు. మూడో ఉత్తరం మగవాళ్ళ దస్తూరి. విలాసం నీలిమాపోస్ అని ఉంది. గులాబిరంగు కవరు. ఈ ఉత్తరంకూడా చంద్రబాబుకు నిరుత్సాహాన్ని కలిగించింది. నీలిమా పురుషుని పేరు.

"నీలిమా బాబూ!

మీరు వెళ్ళేటప్పుడు మీ చేతికర్ర, సిగార్ కేసూ రెండూ మరిచిపోయి వెళ్ళారు. మీ యూరిన్ ఎగ్జామిన్ చేయించిన రిపోర్టు యివాళ వచ్చింది. దీనితో పాటు పంపుతున్నాను. ఫోర్ పర్సెంట్ సుగర్ వుందిట!..."

ఉంటే వుంది! వురిపోసుకోక పోయినారూ!—

ఇలాంటి తుక్కు ఉత్తరాలు చదివేందుకు చంద్రబాబుకు తీరికలేదు.

నాలుగో ఉత్తరం తీశాడు. పెద్ద ఉత్తరం. మగవాళ్ళ దస్తూరి. కవరు వూడతీయగానే ఒక ఫొటో బైటపడింది. భలే ఫొటో. ఎన్నోసార్లు అతడికికవర్లలో ఎన్నెన్నో ఫొటోలు దొరికాయి కాని, ఇంత చక్కటి ఫొటో యెప్పుడూ కంట పడలా. వాహ్! కళ్ళార్పకుండా దాని వంక అలాగే చూస్తూ ఉండిపోయాడు. నిర్జీవమైన అతడి నేత్రాల్లోకి కొత్తతేజస్సు వచ్చినట్లయింది. ఆ ఫొటో అలావుంచి, ఊపిరాడనంత ఆదుర్దాతో ఆ ఉత్తరం చదవటం మొదలెట్టాడు. ఆహాహా! అద్భుతం! యింతసేపూ పడినశ్రమంతా సార్థకమైంది. ఇదీ ఉత్తరమంటే ఉత్తరం! ఈ కుర్రాడెవరో భలే మొనగాడు వాత్స్యాయనుడు, హేవలెక్ ఎలీస్, ఫ్రాయిడ్ ఎవరినీ విడిచిపెట్టలేదు. అందర్నీ జీర్ణంచేసుకున్నాడల్లే వుంది. ఏంభాష! ఏంవర్ణన! చంద్రబాబుకు నాసారంధ్రా లుబికాయ్. పెదవులు కంపించసాగాయ్ చదివిందే మళ్ళీ చదివి-మూడుసార్లు చదివాడు ఉత్తరం అప్పటికీ తృప్తికలగలా. అసలాఉత్తరం వుత్తరం దాచుకుందామా అనుకున్నాడొకసారి. కాని అది మరీ అన్యాయం కాదా అనిపించింది వెంటనే. ఉత్తరం దాచుకోవటమెందుకు? రసవంతంగా వున్న భాగాలు యెత్తి రానుకుంటే చాలు — మాధురికి చదివి వినిపించవచ్చు. ఇంకా మూడు రోజులువరకు మాధురిని చూడటం పడదు. ఆ తర్వాత యెటూ కలుసుకోవచ్చు. ఇలాంటి ఉత్తరాలు ఇదివరలో మాధురికి చాలా వినిపించాడు. చటుక్కున మాధురి ముఖం మనస్సుకు కన్పించింది. మాధురి యేమిటో యెలాగో వుంది. ఆ ముఖంలో నవ్వే లేదు. దగ్గిరకెడితే మనస్సులో ఏదో కుటిలం వున్నట్లు ముఖం పెట్టుకు

కూచుంది. అయితే యేం- ఎంత అందమైన ముఖం! నవ్వితే చాలు బుగ్గలు సొట్టలుపడతాయి — కాని నవ్వదుగా; యేమయినాసరే ఈ ఉత్తరం మాధురికి చదివి వినిపించాల్సిందే! అప్పటికీ నవ్వక పోతుందా!

ఎంతో ఆసక్తితో ఆ రసవత్తరమైన ఘట్టాలన్నీ రాసుకోవటం మొదలెట్టాడు.

రాసుకోవటం పూర్తిఅయినాక చంద్రబాబు ఉత్తరమంతా మళ్ళీ మొదట్నుంచీ చివరివరకు యింకోసారి చదివి, దాన్ని కవరులోపెట్టి అంటించేశాడు. ఫొటో మాత్రం పైన వుంచేశాడు.

ఇహ అయిదో ఉత్తరం!

విలాసం ఇంగ్లీషులో టైపు చేసివుంది. నీలం కవరు.

ఇలాంటి ఉత్తరాల్లో తలవని తలంపుగా చాలాసార్లు చాలా రసవంతమైన వాక్యాలు లభించాయి. చాలామంది భక్తులు తమ అడ్రస్ టైప్‌చేయించిన కవర్లు భార్యలకిచ్చి వస్తూవుంటారు. టైపిస్టు గరల్స్‌కూడా తమ ప్రియులకు అప్పుడప్పుడు అద్భుతమైన ఉత్తరాలు రాస్తూ వుంటారు.

చంద్రబాబు మళ్ళీ యింకాస్త జరదా బుగ్గను బిగించాడు.

పెద్ద మెరుపు మెరిసింది! కిటికీ తలుపు మూశాడు. నాలుగో వుత్తరం మత్తు ఇంకా అతన్ని పూర్తిగా వదల్లేదు. ఎంత ప్రత్యక్షమైన వర్ణన! ఇది చదివి వినిపిస్తే మాధురి యీసారి తప్పకుండా...

అయిదో ఉత్తరం తెరిచాడు.

"అనంగ్!

నువ్వు వస్తావని తెలిసి సంతోషంతో ఉప్పొంగిపోతున్నాను. ఎప్పుడెప్పుడు వస్తావా అని ఆశతో ఎదురుచూస్తున్నాను. ఇంక నేను ఇక్కడ ఉండలేను. నువ్వు నన్ను తీసికెడుదూ — నీ కాళ్ళమీద పడతాను. నీ ఇష్టంవచ్చిన చోటుకు తీసుకెళ్ళు. నువ్వు ఎక్కడ ఎలా ఉంటే నేనూ నీతోపాటు అలాగే వుంటాను. నన్ను ఈ నరకంలోంచి మాత్రం తప్పించు. నువ్వు ఆలస్యం చెయ్యవద్దు. ముసిలాడు నిన్ననే డ్యూటీలోకి వెళ్లాడు. మూడు రోజులు దాకా రాడు. రేపు సాయంత్రంకాని, ఎల్లుండి ఉదయంకాని నువ్వు తప్పక రాగలవని ఆశపడుతున్నాను. నేను సిద్ధంగా ఉంటాను, అనేక వేల ముద్దులతో—

నీ, ప్రియమైన—మాధురి.

ప్రచండమైన ధ్వనితో బైట ఎక్కడో పిడుగుపడింది.



# న్యాయం-ధర్మం

ధనికొండ హనుమంతరావు



ఉద్యోగం లేకపోయినా పెద్దలు సంపాయించి ఇచ్చిన ఆస్తిపాస్తులతో చీకూ చింతా లేకుండా కాలక్షేపం చేయగలుగుతున్నా. ఐతే వేరే పనేమీలేదని, ఇతరుల పనుల్లోకి తలదూర్చటం నాకు మొదటినుంచీ తలనొప్పిగానే వుండేది. ఎందువల్లనో కాని ఆ 'ఇతరులు' కూడా నన్ను బాధించేవారు కాదు. బహుశా వారి రాజకీయాలకు నేను పనికిరాని వాణ్ణనే నిశ్చయానికి వారు వొచ్చి ఉండాలి.

ఒకనాడు హఠాత్తుగా వెంకయ్య నాకోసం ఎంతో ఆతృతతో వొచ్చాడు. పరిచయమున్నా, స్నేహంలేని వ్యక్తి వొచ్చాడంటే పెద్ద పని పెట్టుకొనే వొచ్చి వుంటాడనేది స్పష్టంగా తెలుస్తూనేవుంది. మర్యాదచేసి కూర్చోమన్నాను. కాని ఎంతో వినయ విధేయతలతో నమస్కరించి నిలబడేవున్నాడు. నాకు తెలియని గొప్పతనాన్ని దేన్నో వెంకయ్య నాకు స్పష్టీకరిస్తున్నాడనే గర్వంతో కూడిన ఆనందం నాలో తొణికిసలాడింది. అతన్ని బలవంతాన కూర్చోబెట్టి నా ఆనందాన్ని తగ్గించుకోవటం ఉచితంగా తోచలేదు.

"ఏమిటి విశేషం?" అన్నాను.

"మీరు న్యాయం ధర్మం చెపుతారని వొచ్చాను," అన్నాడు వెంకయ్య.

ఏ పైకమో అప్పు అడుగుతాడేమోనని భయపడుతూన్న నాకు, పరమానందమైంది. వూళ్ళో పేరువున్న వ్యవహారవేత్త, ఎన్నో తీర్పులు చెప్పగలిగిన సమర్థుడు—వెంకయ్య నాదగ్గిర న్యాయం,

ధర్మం దొరుకుతుందని రావటమంటే, ఇన్నాళ్ళుగా నేను గుర్తించలేని ఒక అజ్ఞాతశక్తిని మేల్కొల్పినట్లయింది.

దూరం ఆలోచిస్తే నాకు తెలివి తేటలకు తక్కువేముంది? నా స్నేహితుల్లో చాలామంది పూర్వీకుల ఆస్థిని తగలేశారు. నేనుమాత్రం ఆస్తిని పెంచలేకపోయినా ఉన్నదాన్ని జాగ్రత్తగా పట్టుకొస్తూనే వున్నాను. అదీగాక నేను తెలివి లేనివాణ్ణనేమాట ఎవ్వరూ ఎప్పుడూ అనుకోలేదు; నేనే నమ్మలేనుకూడాను. న్యాయం ధర్మం చెప్పగలశక్తి నాలో అణిగిమణిగి వుంది; దాన్ని నే నింత వరకూ గుర్తించలేదు. ఏ అనామకుడో యీమాట అంటే నేను లెక్కచేసి వుండే వాణ్ణికాదు. సర్వ సమర్థుడు వెంకయ్యే ఆమాట అంటే నాలోని శక్తిసామర్థ్యాలు చాలా గొప్పవై ఉండాలి. నేను పెద్ద మనిషిని. కనుకనే వెంకయ్యలాటివాడు నా సహాయాన్ని అర్థించాడు. నాకు వొళ్ళు పరవశమై 'అసలు సంగతేమిటి?' అన్నాను.

"మన శంకరయ్య లేడండీ - వాడి విషయం..."

"అదే ఏమిటంట?" అన్నాను ఉద్రేకాన్ని తగ్గించుకొని; ఎందుకంటే ఏ పొలం తగాదాయో ఐతే కొట్లాటలు వరకూ వెళ్ళటంకద్దు; మధ్యలో తల దూర్చి తరువాత కట్లు కట్టించుకోవటం నాకు ఇష్టంలేదు!

"ఏంలేదండీ-మూడేళ్ళక్రితం శంకరయ్యదగ్గర నాలుగొందలు అప్పు తీసుకున్నాను. ఈ నాటికి అది వడ్డీతో ఐదు వొందల పైచిలు కయింది. ఇప్పుడు ఆ డబ్బంతా కక్కమంటాడు. నాకు మరో రెండునెలలన్నా వ్యవధి యిప్పిస్తే కాని నేను తీర్చలేను...తమబోటి పెద్దలు చెపితేకాని అతను వొప్పుకునేట్టులేదు. నన్ను యీ ఆపదనుంచి కాపాడండి."

వెంకయ్య చెప్పింది చాలా సబబుగానే తోచింది. ఉన్న పళాన కక్కమంటే యెవడితరమౌతుంది? కొద్ది వ్యవధి ఇస్తే -శంకరయ్యచేత నేను—నాలాటి పెద్ద మనిషి—యిప్పించగలుగుతే వెంకయ్య ఒక వొడ్డున పడతాడు. ఇందులో మాట సహాయంచేస్తే స రి పో తు ం ది. అది న్యాయంకూడాను. ఐతే శంకరయ్యతో కొంత ఘర్షణపడి వ్యవహారం ముదిరాకనే వెంకయ్య నా దగ్గిరికి వొచ్చివుంటాడు. ఈ చెడిన వ్యవహారాన్ని ఒక మార్గాన పెట్టటం కష్టమే! కాని నాలో నాకు లేని నమ్మకాన్ని వెంకయ్య ప్రవేశపెట్టాడు. ఆ నమ్మకంతోనే నేను యీ సమస్యను విడదియ్యగల శక్తిని పొందానేమో?

కాని వెంకయ్య నా తీర్పును శిరసావహించేందుకు సిద్ధమేఐనా మరి శంకరయ్య సంగతేమిటి? వెంకయ్య నాలో చూడగలిగిన సద్గుణపరంపరను శంకరయ్య గుర్తించాలికదా! అలా కాని పక్షంలో వెంకయ్య నాకు అంటగట్టిన

పెద్దమనిషితనం, న్యాయధర్మ పరిశీలన వగైరాలకు పెద్ద దెబ్బ తగులుతుంది! అంటే శంకరయ్యను ఏదోవిధంగా మన దారికి లాక్కొని కేవలం నా గొప్పతనాన్ని ఒప్పుకునేందుకు ప్రయత్నం చేయాలి వెంకయ్యకు సహాయం చేయటం మాట అటుంచి, నా న్యాయబుద్ధిని విస్తరించటానికే నేను విశ్వప్రయత్నం చేయవలసివుంది. అది తప్పనిసరిగానే తోచింది.

"మరి శంకరయ్య మన మాట వింటాడా?" అన్నాను, సందేహానికివొచ్చే సమాధానంలోనే ముందు కార్యక్రమాన్ని నిర్ణయించుకునేందుకు వీలుగా.

"వింటాడా—అని మెల్లిగా అంటున్నారా? మీఅంత పెద్దమనిషి చెపితే కాదనేందుకు శంకరయ్యకు గుండేదా?"

బాగానేవుంది. గొప్పతనమనేది గుర్తించబడకుండా ఎలావుంటుంది కనుక? ఐతే యీ శంకరయ్యకోసం నేనే వెళ్ళటం హాస్యాస్పదం; అది కేవలం వెంకయ్యను వెనకేసుకొని వెళ్ళటమే అవుతుంది. న్యాయం, ధర్మం చెప్పవలసినవాడు ఆ విధంగా ప్రవర్తించడు కదా! అదీగాక శంకరయ్య నేను చెప్పిన తీర్పును ఒప్పుకుతీరుతాడని వెంకయ్య అంటున్నాడేకాని, తీరా అక్కడికి వెళ్ళాక యెదురుతిరుగుతే ఆ అవమానానికి నేను యెంతగానో బాధపడాల్సివుంటుంది. కనుక శంకరయ్యే నాదగ్గరికి రావటం అన్నివిధాలా అందరికీ మంచిది. నా మాట ఒప్పుకునేందుకు సిద్ధపడితేనే తప్ప శంకరయ్య నాదగ్గరికిరాడు; శంకరయ్య నా దగ్గరికి వొచ్చేట్టుచేయటం వెంకయ్యవిధి; ఇది నా పెద్దమనిషితనాన్ని నిరూపించేందుకుకాదు—వెంకయ్యకు స్వలాభం యేడిసింది కనుక!

"శంకరయ్యను ఇక్కడికి పట్టుకొని రాగలవా మరి?" అని అడిగాను.

"తమ సెలవైతే క్షణంలో రాడూ?"

"సరే ఐతే—"

వెంకయ్య విప్పారిన మొహంతో వెళ్లిపోయాడు. నేను ఆలోచనతో పడ్డాను. గొప్పవాడి గొప్పతనాన్ని ముందు గుర్తించేది ఇతరులు. ఎవడికైనాసరే తన మొహంతప్ప ఇతరుల మొహాలన్నీ కనిపించినట్లే — తన శక్తి సామర్థ్యాలుతప్ప ఇతరుల శక్తి సామర్థ్యాలే ముందుగా కనిపిస్తవి. నేటికి నా నిజమైన విలువ బైటపడే వాతావరణం ఏర్పడబోతున్నందుకు ఎంతో గర్వం కలిగింది.

శంకరయ్యతో ఏవిధంగా మాట్లాడాలో ఆలోచించుకోకముందే శంకరయ్య వొచ్చాడు; వొస్తూనే నమస్కరించాడు. అరె! నా మాట అంటే వీళ్ళకు ఎంత గౌరవం—నేనంటే ఎంత అభిమానం! ఒళ్ళు తెలియనంతపనై తమాయించుకున్నాను

"ఏం శంకరయ్యా-బాగున్నావా?"

అన్నాను, ముందు కాస్త దువ్వి మచ్చిక చేద్దామని.

"తమ దయవల్ల బాగానేవున్నా నండీ" అన్నాడు శంకరయ్య. "ఎందుకో పిలిపించారట—" అన్నాడు వెంటనే—నేను చెప్పబోయ్యేది శిరసావహించేందుకు సిద్ధంగా ఉన్నవాడల్లే.

"ఏం లేదు—మన వెంకయ్య విషయం—" అని నీళ్ళు నమిలాను.

"ఏం చెయ్యమంటారు? ఎన్ని వాయిదాలు ఇచ్చినా బాకీ చెల్లించటం లేదు. డబ్బుకు కిటకిటగా వుంది. అతని అవసరాన్ని నేను తీర్చాను; మరి నా అవసరానికి లేకుండా పోతే ఎట్లా చెప్పండి—మీరే న్యాయం ధర్మం చెప్పండి" అన్నాడు శంకరయ్య వినయంగా.

నేను చెప్పబొయ్యే న్యాయం, ధర్మం కోసం వాదిప్రతివాదులు నిలబడిఉండటం చూసేప్పటికి, నా గొప్పతనం అర్థమై తల దిమ్మెక్కింది. ఎలాగైనాసరే శంకరయ్యకు నచ్చచెపితేనేకాని నా ధర్మబుద్ధి నిరూపణ అవదు.

"అదిసరే, శంకరయ్యా—ఎలాగూ మూడేళ్ళు ఆగావు. మరో రెండునెలలు ఆగు—"

"ఇంకానా?" అన్నాడు శంకరయ్య నిట్టూరుస్తూ.

"రెండు నెలలకు పంటవొస్తుంది. తీర్చుకుంటాను" అన్నాడు వెంకయ్య.

"ఔను—ఉన్నపళాన ఎలా కుమ్మరిస్తాడు చెప్పు. పంటరాగానే తీరుస్తాడు. వెంకయ్య పెద్దమనిషి." అన్నాను. వెంకయ్య పెద్దమనిషితనం నాకు అంత బాగా తెలియకపోయినా ఆ వినయ విధేయతలూ, నాబోటి పెద్దలపట్ల అతను చూపే గౌరవమర్యాదలూ చూస్తే అర్థమౌతూనేవుంది।

"డబ్బుకు చాలా కిటకిటగా వుంది. వెంకయ్య అవసరాన్ని నేను తీర్చాను. నా అవసరానికి కాకుండాపోయింది—" అని శంకరయ్య చప్పరించాడు.

నా మాటను తోసేస్తాడేమో ననే భయం నన్ను ఆవరించింది. అందుకని అన్నాను: "వెంకయ్య చాలా పెద్దమనిషి. కలిసిరాకపోవటంవల్ల నీ బాకీ తీర్చలేక పొయ్యాడు. నీడబ్బుకేమీభయంలేదులే."

"రేపు పంటలోమాత్రం యిస్తాడని యేమిటి?" అని శంకరయ్య సవాల్ చేశాడు.

కాస్త సందుపెట్టినందుకు నాకు పరమానందమైంది. ఆలస్యం చేయకుండా అవకాశాన్ని వినియోగించాను.

"నాబోటి పెద్దమనిషిదగ్గిర మాట అన్నాక తప్పుతాడా వెంకయ్య?" అన్నాను. వెంకయ్య పెద్దమనిషితనానికి సపోర్టుగా నా పెద్దమనిషితనాన్ని నిలబెట్టాను—మరి అంతకన్న మార్గంలేదు.

ఈలోగా సాంబయ్య ఎప్పుడొచ్చాడో కాని అతని గొంతు వినేదాకా నేను గుర్తించనేలేదు.



పోలికలు

"ఆయన అంతగా చెపుతూంటే 'సరే' ననవేం, శంకరయ్యా?" అన్నాడు సాంబయ్య. నా పెద్దమనిషి తనాన్ని పరాయివాడైన సాంబయ్య కూడా గ్రహించినందుకు నాకు పరమానందమైంది.

"సరే తమబోటి పెద్దలమాట కాదనేందుకు నే నెంతవాణ్ణి? పైకం రెండు నెలల్లో యిప్పించాల్సిన బాధ్యత తమది."

"ఓ! అలాగే" అన్నాను. ఇంత తేలిగ్గా పరిష్కారమౌతుందని నేను ఎన్నడూ అనుకోలేదు. వ్యవహారవేత్త అవటం యెంతసులభమో అర్థమైంది. నేనుకూడా, వూళ్ళో వ్యవహారాలకు మధ్యవర్తిత్వాన్ని వహించేందుకు అర్హత వున్నవాణ్ణే! ఐతే నేడే ఆ అర్హతను శంకరయ్యా, వెంకయ్యా కలిసి నిరూపించారు.

"ఏం వెంకయ్యా?" అన్నాను.

"రక్షించారు, స్వామీ?" అన్నాడు వెంకయ్య తృప్తిగా.

"మరి సెలవా?" అని శంకరయ్య నమస్కరించి వెళ్ళిపొయ్యాడు.

వెంకయ్య యెప్పుడు జారుకున్నాడో తెలియదు. మొత్తంమీదలోకకల్యాణార్థం ఒక గొప్పపనిని చేసిన తృప్తితో మనసు నిండిపోయింది నా ఆధిక్యతను తెలుసుకో గలిగిన జ్ఞానకాంతి నాకు దక్కింది. అలాగే ఆలోచిస్తూ పడకకుర్చీలో కళ్లు మూశాను.

* * *

క్రమంగా యీ తీర్పునుగూర్చి మరిచిపొయ్యాను. మరెవ్వరూ నాతీర్పుల కోసం రాకపోవటమే దీనికి కారణమై వుండొచ్చు.

ఒకనాడు ఉదయానే శంకరయ్య




పో లి క లు

ప్రత్యక్షమయ్యాడు. మరో తీర్పుకోసం వొచ్చాడేమో ననుకున్నాను.

"చూడండి—వెంకయ్య వ్యవహారం!" అన్నాడు. మొహం చిటచిటలాడుతోంది. ఏదో రసాభాస అయి వుంటుందని అర్థమౌతూనేవుంది. నేను చెప్పిన తీర్పుకు రెండునెలల వయసు దాటిందనికూడా ఇప్పుడే తెలుసుకున్నాను.

"ఏమైందీ—" అన్నాను.

"పంటరానూవచ్చింది—అమ్ముకొని తిననూ తిన్నాడు—"

నాకు వొళ్ళుమండింది. వెంకయ్య ఇంత నీచంగా ప్రవర్తిస్తాడనుకోలేదు. ఏదో మంచివాడని, పెద్దమనిషని నేను అతని పక్షాన పోరాడి వ్యవధి ఇప్పిస్తే యీవిధంగా దుర్వినియోగపరుస్తాడనుకోలేదు శంకరయ్య నిజంగా పెద్దమనిషి కనుకనే నేను చెప్పిన తీర్పుకు బద్ధుడై వున్నాడు. నా తీర్పును తృణీకరించి, నన్ను అవమానించిందల్లా-వెంకయ్య!

"కనుక్కుంటాను.ఆగు," అన్నాను.

"కనుక్కోవటంకాదు..తేల్చెయ్యండి."

"సరే" అన్నాను తప్పక.

వెంకయ్యకోసం కబురు చేశాను, రాలేదు. ఎన్ని కబుర్లుచేసినా టలాయిస్తున్నాడు. అతను రాకపోవటమే అతని కల్మషాత్మకు నిదర్శనం. శంకరయ్య పోరు జాస్తయింది. మరో మార్గం లేక నేనే వెంకయ్య ఇంటికి బయలుదేరాను.

అష్టకష్టాలూ పడి వెంకయ్యను వెదికి పట్టుకున్నాను.

"ఏం ఇలాచేశావ్?" అన్నాను, కోపంతో.

"ఏం చెయ్య మంటారు—పంటలో అనుకున్నంత రాలేదు. ఇంటి ఖర్చులు అనుకోకుండా పెరిగిపోయినవి. పై పంటలో తప్పక తీరుస్తాను" అన్నాడు.

ఇదేమిటి-ఇలా చేస్తాడని నే నెన్నడూ అనుకోలేదు. యీ సంగతి శంకరయ్యకు చెప్పి ఔప్పించటం సాధ్యమా? యీ రెండునెలల గడువుకే నా చాకచక్యా న్నంతట్నీ ఉపయోగించాను. ఇప్పుడు మళ్ళీ గడువిప్పించటం నాకు తలకు మించినపని. పోనీ ఆ ప్రయత్నం తరు వాత చేయవచ్చు. ముందు యీ వెంకయ్య ప్రవర్తనగూర్చి విచారణ జరగాల్సిందే!

''ఇదేం బాగా లేదు, వెంకయ్యా-" అన్నాను కాస్త మెత్తగానే; కారం రాచు కున్నట్లు ప్రవర్తిస్తే అసలుకే మోసం వొస్తుందనే భయంతో ముళ్ళమీద ఆరేసిన బట్టను తీసేప్పుడు ఉపయోగించే జాగ్రత్తను మరిచిపోలేదు.

"శంకరయ్యను ఒప్పించగలమా?"

"తమబోటి పెద్దలుచెపితే తప్పక ఒప్పుకుంటాడు..." అని నసిగాడు.

ఏమని చెప్పి ఒప్పించేది? నన్ను పెద్దమనిషిగా, మధ్యవర్తిగావుంచి యీ స్థితికి దింపారు. ఇంకా గడువు ఇప్పిస్తే మిగిలివున్న యీ కాస్త పెద్దమనిషితనం కూడా హరించుకొని పోతుంది.

వెంకయ్యమీద విసుక్కున్నాను. కోప్పడ్డాను. రెండుమూడు దూషణ వాక్యాలుకూడా ఉపయోగించాను. కాని వెంకయ్యలో చలనంలేదు; వొంచిన తల ఎత్తలేదు. నోరు నొప్పిపెట్టి ఇంటిదారి పట్టాను.

శంకరయ్య నాకోసమే కాచుకొని కూర్చున్నాడు. అసలే విసుగ్గావున్న సమయంలో యీ భ్రష్టుడు ఎదురవటం వొంటిమీద గొంగళిపురుగులు పాకట మల్లేనేవుంది. ఐనా తమాయించు కున్నాను,

''ఏమైంది?" అన్నాడు శంకరయ్య.

"పైపంటకు ఇస్తానంటాడు!" అన్నాను.

"ఏమండీ—మీరు చెప్పబట్టి వూరు కున్నాను. ఏంచేశాడో చూశారుగా? పెద్ద మనిషన్నారే."

"మరి ఏంచేద్దామంటావు?" అన్నాను రాజీగా.

"నా పైకం ఇప్పించండి-"

"ఎలాగంట?"

"ఎలాగో నాకేంతెలుసు? మీ అవస్థలు మీరు పడి నా బాకీ ఇప్పించివేయండి. తమ బాధ్యతమీదనే నేను వూరుకున్నాను కదా?"

"పైపంటదాకా ఆగటంతప్ప మరో మార్గం ఏముంది?''

"మార్గం మీరే ఆలోచించండి. రెండు రోజుల్లోగా నాకు పైకంకావాలి-"

నాకు ఛర్రుమంది.

''ఐతే నన్ను యిచ్చుకోమంటావా యేం?" అన్నాను. నే నిస్తే కాదనడని తెలియక కాదు. అతని వుద్దేశ్యం అదే నేమోనని!

"నాకు అనవసరం. ఎవరైనా కాని వ్వండి. ఇవ్వాల్సిందే! నాకు పైకం

ముట్టచెప్పవలసిన బాధ్యత తమమీద వుంది—"

"నామీదా? యేదో తగాదాపడితే సర్దేందుకు చూశాను కాని, నాకు బాధ్య తేమిటి?" అన్నాను.

"బాధ్యత మీరు తీసుకున్నారు. కనుకనే ఆనాడు నేను వూరుకున్నాను. లేకుంటే నా అవస్థ నేను పడేవాణ్ణి-"

"అందుకని నన్ను యిచ్చుకో మంటావా?"

"నేను అనను, కాని నాకు పైకం ముట్టచెప్పండి. పెద్దమనుషులకు ఒకే నాలుక కదా!—"

నా పెద్దమనిషితనాన్ని శంకించటం వరకూ వ్యవహారం ముదిరింది.

"శంకరయ్యా! వెంకయ్య పైకం ఇచ్చేట్లుగా ప్రయత్నంచేస్తాను కాని అది కాకపోతే నీ అవస్థ నువ్వేపడి మీరిద్దరూ కట్టకట్టుకొని గంగలో దూకండి, అంతే కాని నేనేంచేసేది?" అన్నాను.

"ఈనాడు మీరు చేతులు కడుక్కుంటే సరిపోతుందనుకున్నారా? ఆనాడు మీరు మాట అడ్డంవేయకుంటే నేను యేం చేసుకునేవాణ్ణో మీకు అనవసరం. మీ బాధ్యతను ఇంత తేలిగ్గా మరిచిపోతా రనుకోలేదు-"

నాకు కారం రాచినట్లయింది.

"ఏమిటి నీ వుద్దేశ్యం?" అన్నాను నిలవదీసి.

"ఏ పెద్దమనిషికన్నా చెప్పండి-యే మంటాడో!" అన్నాడు శంకరయ్య.

నేనే ఒక పెద్దమనిషినై వుండి, ఇంకో పెద్దమనిషికోసం వెళ్ళటంకన్న తల వొంపులు వుండబోదు. ఐతే లోగడ పెద్దమనిషితనాన్ని డబ్బు ఖర్చులేకుండా సంపాయించాను. ఇప్పుడు ఆ పెద్దమనిషి తనాన్ని నిలబెట్టుకునేందుకు వెంకయ్య బాకిని నేనే చెల్లించవలసిన పరిస్థితి యేర్పడింది. ఎప్పుడైతే 'డబ్బు' ఇందులో ఇరికిందో కాస్త దూరంగా వుండటమే శ్రేయస్కరంగా తోచి "అది నావల్ల కాదు-" అన్నాను.

"ఆ రోజున సాంబయ్యగారుకూడా వున్నారు. ఆయన్ని చెప్పమనండి," అన్నాడు శంకరయ్య.

"ఆ య న చె ప్ప ట మే మి టి ?" అన్నాను కోపంతో వొణికిపోతూ.

"ఆనాడు ఆయనకూడా వున్నారుగా! మీరేదో వొరగబెడతామని చేసిన వాగ్దా నాన్ని ఆయన మరిచిపోయి వుండరు-"

"నాకు యెవరి అభిప్రాయాలతోనూ పనిలేదు," అని, జవాబుకు యెదురు చూడకుండానే లోనికి వెళ్ళిపోయాను.

అరగంటగడిచేప్పటికి, సాంబయ్యతో సహా శంకరయ్య యింటిముందుదిగాడు. ఇందాకటి మంట తగ్గకముందే మళ్ళీ రభస ప్రారంభం.

"ఏ మ ం డీ , సాంబయ్యగారూ?" అన్నాను.

"ఏంలేదు ..ఆనాడు జరిగినదానికి సాక్ష్యంగా శంకరయ్య నన్ను తీసు కొచ్చాడు."

''చూడండి-ఆ డబ్బు నన్ను ఇచ్చుకో మంటాడు; యిదేం న్యాయం స్వామీ?" అన్నాను.

"మీ రివ్వటం కాదుకానండి, ఇప్పిం చాల్సిన బాధ్యత మాత్రం తమదే!"

నాకు చచ్చినంత పనైంది. రెండు ఆబోతులమధ్య యిరుక్కున్న లేగదూడ స్థితిలో పడ్డాను.

"అలాగైతే పైపంట దాకా ఆగ మనండి," అన్నాను, ఓడిపోయే కేసును ఏదోవిధంగా సరిచేసేందుకుగాను ప్రయ త్నించే లాయర్ లాగు.

"ఎట్లా? మీరు రెండు నెలలు వాయిదా ఇప్పించారు అంతవరకూ ఆగనే ఆగాడు," అన్నాడు సాంబయ్య.

అటుతిరిగీ ఇటుతిరిగీ ఇది నా మెడకే చుట్టుకుంది. తీర్పు చెప్పిన న్యాయాధి కారికి ఆ తీర్పును అమలు జరిపేందుకు పోలీసుల సహాయం ఉంటుంది. నాకు అలాటి అవకాశాలేమీ లేవు.

"నన్ను ఏం చేయమంటారు?" అన్నాను సగం చచ్చి.

"అతనిచేత ఇప్పించండి, లేదా ఆ పైకం మీరే ఇచ్చుకొని వెంకయ్య దగ్గర వసూలు చేసుకోండి,'' అన్నాడు శంక రయ్య.

నిస్సహాయంగా సాంబయ్య మొహం వొంకచూశాను. సాంబయ్య "అంతే" అన్నట్లు తల ఆడించాడు.

వెంకయ్య దగ్గర వసూలుచేసి ఇవ్వటం నాకు మించినపని! శంకరయ్య లాటి వాడికే సాధ్యపడలేదు. పోతే నేను ఇచ్చుకోడం ఒక్కటే మిగిలింది. సాంబయ్యలాటి వాడుకూడా శంకరయ్య వైపే మొగ్గుతున్నాడు. వూళ్లో ఇంతెవరి దగ్గిరకి వెళ్ళినా ఇంతకు మించిన న్యాయం దొరుకుతుందనే నమ్మకం నాకు కలగటంలేదు. పైపెచ్చు నేను చేసిన వెధవపనినికూడా విమర్శిస్తారు. నా పెద్దమనిషితనాన్ని నిలబెట్టు కునేందుకుగాను రభసకాకుండా చూసు కోవటం అవసరమైంది.

"సరే, చూస్తాను," అన్నాను.

"చూడటంకాదు; రెండురోజుల్లో నా పైకం ఇప్పించాలి-" అని ఇద్దరూ వెళ్ళి పోయారు.

'ఇప్పించాలి' అంటే 'ఇవ్వు' అన టమే! రెండురోజుల్లోనూ వెంకయ్య వెంటపడ్డాను కాని ప్రయోజనం లేక పోయింది. చూస్తుండగానే గోళ్లూడగొట్టి నట్లు, శంకరయ్య ఐదువందలూ వసూలుచేసుకొని వెళ్ళాడు.

వారం గడవకముందే వెంకయ్యా శంకరయ్యా ఎంతో స్నేహంగా జల్సాగా పట్నానికి బయలుదేరారని తెలిసింది. అది మొదలు ఇంత ఖరీ దైన యీపెద్దమనిషితనాన్ని-న్యాయం, ధర్మం తెలిసిన నేను మరెన్నడూ దాన్ని వినియోగించకూడదని నిశ్చయించు కున్నాను.



# చక్రపాణి

**కావిలిపాటి విజయలక్ష్మి**

(గత సంచిక తరువాయి)

"ఏమో! మీరేం చెప్పగలరు? కళ్ళూ కాళ్ళూ, తెలిసీ ఉన్నవారినే మోసగించే మొనగాళ్ళున్న మన దేశంలో..."

"ఆ బాధ లేదులెండి. అత్తయ్య అప్పుడప్పుడు ఎకౌంట్సు చూస్తుంది. ఆమెకు తెలిసిన మన భాషలోనే పద్దులు వ్రాయమంటాను గుమాస్తాని. తర్వాత చెక్కు సంతకాలు చెయ్యాల్సివస్తే విధిగా రంగారావుగా రుంటారు వారేకారణంగానైనా లేకపోతే మీరుంటారుగా ఇటువైన?"

"నామీద అంత నమ్మకమా మీకు?"

"నమ్మకమే. మీ గొంతునిబట్టి మీరు సంస్కారవంతులని గ్రహించాను. ప్చ్. ఇన్నాళ్ళుగా నాకెవ్వరూ చెప్పని విషయం చెబుతున్నారు మీరు. వ్యాపార వ్యవహా

రాలు చూసే వ్యక్తి కావాలని" అంటూ నవ్వేసి, "అ దిప్పుడు అనవసరం. అవ్వాళ కథ పూర్తిగా చదవరూ!"

అపజయం పొందినట్టు ఫీలయ్యింది పద్మావతి. అసలు వద్దనుకుంటూనే ఆ విషయ ప్రసక్తి ఎందుకు తెచ్చానా అని బాధపడింది.

రెండు క్షణాల మౌనం తర్వాత, "ఇన్సల్టు ఫీలవుతున్నారా పద్మావతీ! ఎవరన్నా పెళ్ళిచేసుకోమని చెబితే మండిపోతుంది, నా మనసు. మీరూ అలా చెబితే చురకత్తితో సూటిగా హృదయాన్ని కోసినట్టయింది నాకు. క్రమంగా ఆ వ్యాపార వ్యవహార బాధ్యతలుకూడా మీ కప్పగించా లనుకుంటున్నాను. సరే మన మధ్య సంభాషణలేవైనా సరదాగా సంతోషంగా దొర్లాలి. కాలం తేలిగ్గా దొర్లిపోవాలి కాని సుదీర్ఘం కాకూడదు. ప్లీజ్ నిన్నటి కథ..."

"పత్రిక ఎక్కడ ఉంది?"

"డ్రాయరు సొరుగులో చూడండి."

గబగబా చదివివేస్తూన్న పద్మావతిని "ఏదీ పుస్తకం ఇలా ఇవ్వండి," అని అడిగాడు పాణి.

అతనిచేతికి మౌనంగా పత్రిక అందించింది పద్మావతి.

"అలా సీరియస్‌గా చదివితే నేను వినను. నామీద కోపం వచ్చినట్టుంది. అవునా?" అన్నాడు పాణి.

"మీమీద కోపమా! బాగుందండీ అనవసర విషయాల్లో జోక్యం పెట్టుకోవద్దనోట యజమానిగా హెచ్చరించారు. మంచిదేగా?"

"సారీ...క్షమించండి పద్మావతీ! ఎలా చెప్పాలో చేతకాక ఏమేమో మాట్లాడేశాను. ఇన్ని సంవత్సరాలుగా ఎవ్వరూ చెప్పని జాగ్రత్తలు చెబుతూంటే."

"మందలించారు. నీకా అర్హతలేదు నోరుమూసుకో అని."

"పద్మావతీ..."

"త్వరలో ఇంకేదన్నా ఉద్యోగం చూసుకుంటాను లెండి."

"ప్చ్. నా ఖర్మ. నన్ను అర్థంచేసుకోలేదు మీరు."

"ఎందుకులెండి. ఎక్కడన్నా వంట పని దొరికినా వెళ్ళిపోతాను."

"భగవంతు దేశిక్ష విధించినా తలవంచుతూన్నవాణ్ణే పద్మావతీ! ఈ ఆరు నెలలూ నా చీకటికళ్ళముందు ఓ తార మెరిసి మురిపిస్తూ వచ్చింది. మళ్ళీ ఆ తార మాయమై కాటుకలాటి చీకటి అలముకుంటే మాత్రం ఈ గుడ్డివాడేం చెయ్యగలడు పద్మావతీ! వెళ్ళిపొండి. మీ ఇష్టాన్ని కాదనే హక్కు నాకు లేదు. నా బ్రతుకు చీకటిలో మెరసి మాయమైన 'తార' స్మృతులతో ఈ గదిలో వంటరిగా బ్రతికి ఎప్పుడో రాలిపోతాను" నెమ్మదిగా గొణిగినట్లున్న అతని గొంతు రుద్ధమై మూగబోయింది

తగ్గుస్వరంతో గబగబా అన్న అతని మాటలు ఆమెకు అర్థంకాలేదు

కాని, క్షణాల్లో వాడిపోయిన అతని వదనం, బాధగా ధ్వనించిన అతని గొంతూ, ఆమె మనస్సుని ద్రవింప జేశాయి.

"బాధపడకండి పాణిగారూ! అస్సలిప్పుడు ఎందుకు వచ్చానో! అనాలోచితంగా, తొందరపాటుగా ఏమేమో వాగేశాను. నేను వెళ్ళిపోవటంలేదు. అస్సలు మిమ్మల్ని మామూలు మనిషిగా, అంటే మీలో జీవితంమీద అనురక్తి రగిలించే దాకా ఎక్కడికీ వెళ్ళను" అంది అర్ద్ర స్వరంతో ఆవేశంగా!

నామీద తాత్కాలికంగా కలిగిన జాలితో అలా అంటున్నారేకాని మీరు వెళ్ళిపోక శాశ్వతంగా ఈ ఉద్యోగంలో ఉండిపోతారా! అలా నా దగ్గర ఉండిపొమ్మనటం అన్యాయం కదూ! పెళ్ళి చేసుకుంటె వెళ్ళిపోరూ!''

"ప్చ్. వెళ్ళా! నేను ఈ జీవితంలో పెళ్ళిచేసుకోను పాణిగారూ! ఈ కళ్ళులేని అన్నయ్యకు తోడుగా ఉండిపోతాను.''

ఏమో అనబోయి, ఆగి, "థాంక్స్" అని బరువుగా నిట్టూర్చాడు పాణి.

"అబ్బ. ఇవ్వాళ ఎండ ఎలా ఉందో!''

"ఎలా వెళతారు. ఈపూట ఉండిపోతాదూ!"

"ఎందుకులెండి వెళ్ళిపోతాను."

"సాయంత్రం చల్లబడిన తర్వాత వెళ్ళొచ్చు." 'అప్పారావ్' గట్టిగాపిల్చాడు పాణి.

అతను రాగానే, "సుశీలమ్మగారికి, పద్మావతిగారు ఇవ్వాళ అహ కాదు, ఈ పూట పాణిగారిఇంట్లో ఉండిపోతారట. భోజనానికి రారట అని చెప్పి, అలా నువ్వు భోజనానికి పో," అన్నాడు పాణి.

అతన్ని వారిస్తూ ఏమో అనబోయిన పద్మావతిని మాట్లాడనివ్వలేదు పాణి. "సాయంత్రం వెళ్ళవచ్చులెండి. సుశీలమ్మగారిలాటిదే మా అత్తయ్య కూడా మీకు." అంటూ.

అతని చేతిలో నలిగిపోతూన్న పత్రిక నవ్వుతూ తీసుకొని, వదిలిన కథ పూర్తిగా చదివింది పద్మావతి.

"ప్చ్. పాపం గుర్నాధంలాంటి వ్యక్తులుంటారు కాబోలు," అన్నాడు పాణి నవ్వుకుంటూ.

పద్మావతి ఆ పూట ఉండిపోయినందుకు సంతోషించింది అన్నపూర్ణమ్మ.

ఇద్దరికీ ఆప్యాయంగా వడ్డనచేస్తూ, "పద్మావతీ! మా ఇంట్లోనే ఉండిపోరాదూ!" అంది ఓసారి.

చిన్నగా నవ్వి మౌనంగా ఉండిపోయింది పద్మావతి. 'పుస్తకం చదవడానికి, మంచి అందగత్తెనే చేరతీశాడురా చక్రపాణిగారు!' అని ఒకరంటే 'కళ్ళులేకపోయినంత మాత్రాన మిగతా

అవసరాలుండవూ!' అని రెండో అతను 'తను రంగారావుగారింటికి వెళ్ళిపోతున్నప్పుడు తన వెకిలకవస్తూ అనడం విందో సారి పద్మావతి. ఇలాటి మాటలు చాలా వింటోంది ఒక్కోసారి మనస్సు అవమానంతో కృంగిపోతుంది. మళ్ళీ తనకు తానే చెప్పుకుంటూంది. తాను పవిత్రంగా ఉన్నప్పుడు ఎవరేమనుకుంటేనేం? అని మొండిగా తిరుగుతూంది. వీరి ఇంట్లోనే ఉండిపోతే ఇంకేమన్నా ఉందా!

''పద్మావతీ, కూరలో ఉప్పు చాల లేదు కదూ!'' అన్నాడు పాణి.

''బాగానే ఉందిలెండి.''

ఆమె జవాబుకు నవ్వాడు పాణి.

కళ్ళున్న మనిషిలా అన్నీ కలుపుకుని తింటూన్న పాణివైపు ఆశ్చర్యంగా చూసింది పద్మావతి.

అతను భోజనం ముగించి చెయ్యి కడుక్కుని తువ్వాలుతో తుడుచుకుంటూ లేచినిల్చుని, ''పద్మావతీ కాస్సేపు రెస్టు తీసుకోండి. పడమటివైపు గదిలో బెడ్ వగైరా ఉన్నాయ్. అత్తయ్యా ఆమెకు చూపిస్తావుకదూ!'' అన్నాడు పాణి.

''అలానే. నువ్వుపోయి పడుకో.'' అంది అన్నపూర్ణమ్మ.

వద్దనుకుంటూనే, తెలుసుకోవాలనే ఆరాటాన్ని అరికట్టలేని పద్మావతి, వారి వ్యాపార విషయాలు అన్నపూర్ణమ్మను ప్రశ్నించి సేకరించింది. అన్నపూర్ణమ్మకు కూడా రంగారావంటే బాగా నమ్మకమున్నట్టు తోచింది. ఇప్పుడు చెప్తే లాభంలేదు. నమ్మరు. వీళ్ళలో ఓ మనిషిగా కలిసిపోయి నమ్మకం కుదిరాక, అప్పుడు ఈ జంబుకాలు చేసే మోసాలు కనిపెట్టి చెప్పాలి. అతని పెన్షనుతో అంత దర్జాగా బ్రతకడమే కష్టం. అలాటిది పట్నంలో మేడ కట్టడమంటే సామాన్యమా! మేనేజరూ, రంగారావూ, మళ్ళీ వారివైపు నడిచాయి ఆలోచనలు.

మంచంమీద పరుపు, పరచిన తెల్లని దుప్పటి, పక్క మెత్తగా ఉండటతో. నడుంవాల్చే సరికే నిద్రవచ్చింది. కిటికీల్లోంచి ఉండి ఉండి చల్లని గాలి వీస్తోంది. కారణం గదికిటికీలను మూస్తూ గుబురుగా ఎదిగిన మామిడి చెట్లు. చాలా హాయిగా ప్రశాంతంగా ఉంది. పోనీ వీరి ఇంట్లో ఉండిపోతేనో. అనేవాళ్ళు ఎలానూ అనక మానరు. రంగారావు చుట్టమా! ఇతను కాక పోయాడా! అవ్వాళ చక్రపాణిగారు అననే అన్నారు. ఇక్కడ ఉండిపో రాదూ! అని. ఇలా కొంచెంసేపు ఆలోచనలు సాగాయి. ఆ ఆలోచనలలోనే కళ్ళు మూతలుపడి నిద్రపట్టేసింది.

ఆమెకు మెలకువ వచ్చేసరికి సిలన్‌లో తెలుగుపాటలు వస్తున్నాయి. బాత్‌రూం కెళ్ళి మొహం కడుక్కుని వచ్చేసరికి, తువ్వాలందిస్తూ, ''అమ్మాయ్, చూడు. పాణి గదిలో పొడరూ, దువ్వెనా

ఉన్నాయి. కాని బొట్టు ఎలా. మహా లక్ష్మి దగ్గర కుంకుమ ఉంది. కాని తొ త్తిగా ఇటుకపొడిలా ఉంది,'' అంది అన్నపూర్ణమ్మ నవ్వుతూ.

"ఫర్వాలేదు. ఇవ్వండి.'' అంది పద్మావతి.

గదిలో అడుగుల సవ్వడి వినరావ డంతో ''ఎవ్వరూ! అత్తయ్యా!" అన్నాడు పాణి.

''నేను. పద్మావతిని. ఆ గదిలో చల్లగా హాయిగా నిద్రపట్టేసింది సుమండీ! ఇప్పుడు నాలుగున్నరయింది టైము. చాలా సేపు నిద్రపోయాను."

"మంచిపని చేశారు. కాఫీ టిఫినూ తీసుకున్నారా?"

"టిఫినెందుకు? కాఫీ తీసుకుంటాను లెండి."

"మీరు లేచాక తీసుకోవాలని నేను ఎదురుచూస్తున్నాను,"

"ఓ. మీ రెందుకున్నా రింతవరకూ, నేనేం కొత్త అతిథినా! అయితే తీసుకు వస్తానుండండి."

"మీరుకూడా తీసుకుంటేనే."

"అలానే లెండి."

జడ అల్లుకోవాలని ముడివిప్పుకున్న దల్లా ముడిచుట్టేసుకుని వంటగదివైపుకు వెళ్ళింది పద్మావతి.

"అమ్మాయ్. ముందు కాఫీ తాగెయ్. ఈ టిఫినుప్లేటు తీసుకొని పాణికి ఒక టివ్వు, ఒకటి నువ్వు తీసుకో,'' అంది అన్నపూర్ణమ్మ పద్మావతిని చూస్తూనే.

మత్తుగా, బద్ధకంగా ఉండటంవలన, ఆమె చెప్పినట్టే కాఫీ తాగేసి టిఫిను ప్లేటు తీసుకొని పాణి గదిలోకి వెళ్ళింది పద్మావతి. ఆమె వెనుకే మంచినీళ్ళ గ్లాసు పట్టుకొని అన్నపూర్ణమ్మ వచ్చింది.

"టిఫిను తీసుకువచ్చాను,'' అంది పద్మావతి, పాణి ఎదురుగా అతనికి దగ్గరలో నిల్చుని.

అతను చెయ్యి ముందుకి చాపాడు.

మంచినీళ్ళ గ్లాసు వారి ముందుంచి వెళ్ళిపోయింది అన్నపూర్ణమ్మ.

అతను టిఫిను తింటున్నప్పుడు ''మంచినీళ్ళు కావాలా?" అని రెండు సార్లు అడిగింది పద్మావతి.

టిఫిను పూర్తయిన తర్వాత, నెమ్మ దిగా ప్లేటు దిగువున పెడుతూ "మంచి నీళ్ళిస్తారా?" అన్నాడు పాణి.

అతని చేతికి మంచినీళ్ళగ్లాసిస్తూ, ''అలా చెయ్యి కడిగేసుకోండి'' అంది పద్మావతి.

అతను వంగి ప్లేటు చేతితో తడిమి చూసి అందులో కొంచెం నీళ్ళతో చెయ్యి కడుక్కుని జేబులో రుమాలుతీసి చెయ్యి పెదవులూ తుడుచుకున్నాడు.

"ఇవ్వాళ ఏం పుస్తకం చదవ మన్నారు?" అడిగింది పద్మావతి. ఇంకా మొదలుపెట్టిన రామాయణం పూర్తిగా చదవనేలేదు. కాని అది విన

కానికి పాణి అంత సుముఖంగా లేదని ఆమె గ్రహించింది.

"ఏ పుస్తకమూ వద్దు. నాలుగు కబుర్లు ఏమన్నా చెప్పండి.''

"కబుర్లయితే మీరే చెప్పండి. నేను వింటాను."

"నేనేం కబుర్లు చెబుతాను? పన్నెండు సంవత్సరాల క్రితమే కనులు మూసుకు పోయాయి. ప్రపంచ మెలాఉందో నాకు తెలియదు.''

"పోనీ, మీరు చదువుకునే రోజుల కబుర్లు. మీ అమ్మా, నాన్నగారూ, మీ తోటివాళ్ళ కబుర్లు!"

"వినాలని ఉందా?"

"మీకు అభ్యంతరం లేకపోతే!"

అతను మౌనంగా ఉండిపోయాడు.

"పోనీ మీకు అభ్యంతరమైతే చెప్పొద్దులెండి. ఇంకేమన్నా చెప్పండి."

"అభ్యంతరాని కేముంది?" అని నవ్వి "చెబుతాను వినండి. పుడుతూనే దురదృష్టం నన్ను వరించిందేమో? నేను పుట్టిన మూడురోజులకు నన్ను కన్న తల్లి కన్నుమూసింది. పసికందుగా విధిచేతిలో నలిగిపోయాను. అస్సలు తల్లిప్రేమ ఎలా ఉంటుందో నాకు తెలియదు. మా అమ్మమ్మ నన్ను తనతో తీసుకుపోయిందట. ఆమె జాలితో అభిమానంతో నన్ను పెంచి ఉంటుంది. మళ్ళీ విధి నాపై దెబ్బతీసింది. నాకు మూడు సంవత్సరాల వయస్సు రాగానే ఆ అమ్మమ్మ స్వర్గస్థురాలయిపోయింది."

"మరి. మీ నాన్నగారు?"

"నాన్నగారు, మా అమ్మపోయిన ఆరునెలలకు పునర్వివాహం చేసుకున్నారట. మా పిన్ని నన్ను వారి దగ్గరకు తీసుకువెళ్ళటానికి అంగీకరించని కారణాన నేను అమ్మమ్మ దగ్గరే ఉండిపోయాను. మా అత్తయ్య తరుచు వచ్చి నన్ను చూసిపోతూ ఉండేదిట. నాన్న కూడా ప్రతివారం వచ్చి నా యోగక్షేమాలు కనుక్కొని వెళ్ళిపోయే వారట. నాకు అంతగా గుర్తులేదు అప్పటి సంగతులు. అమ్మమ్మ పోయిన తర్వాత వారింట్లో కూడా నాకు స్థానం లేకపోయిందనుకుంటాను అని క్షణం తర్వాత నన్ను మా నాన్నగారు ఓ బోర్డింగ్ స్కూల్‌కి అప్పగించారు. నాకు ఎనిమిది సంవత్సరాలు వచ్చేవరకూ అక్కడే పెరిగి చదువుకున్నాను. నా కిప్పటికీ, దిగులుగా విషాదంగా నావైపు చూసి కన్నుల్లో నీరు నింపుకునే మా నాన్న వదనం గుర్తుంది. మా నాన్న వచ్చేసరికి ఎగిరి ఆయన్ని వాటేసుకుని నీతో తీసుకుపో అని ఏడ్చేవాణ్ణి. ఆయన నన్ను వదలలేక వదిలివెళ్తూ వెనక్కి తిరిగిచూస్తూ వెళ్ళిపోయేవారు. నేను ఏడుస్తున్నానని కాబోలు ఆయన ఏవేవో మిఠాయిలు తీసుకొని తరుచు వస్తూండేవారు.

"నేను ఫోర్త్ క్లాసు చదువుతున్నప్పుడు మా నాన్న స్కూలుకి వచ్చి 'నిన్ను తీసుకుపోతాను' అని చెప్పేసరికి నా సంతోషానికి అవధుల్లేవు. నాన్న మాత్రం చాలా విచారంగా ఉన్నట్టు కనుపించారు. మర్నాడు నాన్న నన్ను ఇంటికి తీసుకు వచ్చారు. నేను ఎరుగని మా ఇంటికి వచ్చిన నేను వింతగా, సంతోషంగా మా ఇంట్లో అడుగుపెట్టి నాలుగువైపులా బెదురుగాచూస్తూ నిల్చున్నాను. అత్తయ్యవచ్చి అమాంతం నన్ను ఎత్తుకు ముద్దుపెట్టుకుంది. నువ్వు చాలారోజులై నన్ను చూడటానికి రావడం మానేశావ్. నన్ను ఎత్తుకోవద్దు అంటూ ఆమెను కోపంగా విదిలించుకున్నాను.

"ఆమె కళ్ళల్లో నీళ్లు తిరిగాయి. ఎందుకో నాకు అర్థంకాలేదు. అత్తయ్య ముఖాన్న బొట్టులేదు. చేతిన ఎర్రని గాజులుండేవి. అవికూడా లేవు. తర్వాత మా పిన్ని ఎలా ఉంటుందో చూడాలని వెతికాయి నా కళ్ళు. కాని అన్ని గదుల్లో తిరిగాను కాని మా పిన్ని కనిపించలేను. అని, ఆగి ఎలా ఉంది? కథ? విసుగ్గా ఉందా?" అడిగాడు పాణి.

"లేదు. చెప్పండి." అంది పద్మావతి కుతూహలంగా.

"అప్పటి నా లేత హృదయంలో ఏదో కలవరం. మా నాన్న పిన్నిని తరిమేశారా? అనే ఊహ వచ్చి చలించిపోయాను. అత్తయ్య నేను హాస్టల్లో ఉన్నప్పుడు కూడా తరుచువచ్చి నాకే తినుబండారాలూ, కొత్తబట్టలూ తెచ్చి ఇచ్చేది. మా నాన్న వచ్చి చాలా రోజులైన కారణంగా, అంటే నేను హాస్టల్లో ఉన్నప్పుడు. అత్తయ్య నడిగాను ఓ సారి. 'మా నాన్న రావడంలేదు. ఆరోగ్యంగా ఉన్నారా?' అని. అందుకామె 'ఆ రాక్షసికి జడిసి రావటంమానేసి ఉంటాడు బాబూ!' అంది. ఆ రాక్షసి పిన్నే అని గ్రహించడానికి నాకు ఎంతోసేపు పట్టలేదు. నాకు నవ్వుకూడా వచ్చింది ఎందుకో. 'పోనీ అత్తయ్యా నువ్వు వెళ్ళు నాన్నదగ్గరికి. ఆయన్ని చూశావా? ఈ మధ్య. 'బాగున్నారా?' ఆత్రుతగా ప్రశ్నించాను వ్చ్. నేను కూడా ఆ యింటికి చాలా రోజులై దూరమైపోయాను బాబూ!' అంటూ అత్తయ్య ఏడ్చింది. మా పిన్ని అంత చెడ్డదా? అంత చెడ్డదాన్ని గయ్యాళిని నాన్న ఎందుకు పెళ్ళిచేసుకున్నారు? అనిపించింది. 'నేను పెద్దవాణ్ణయ్యాక నిన్ను ఆ యింటికి తీసుకువెళ్తానులే అత్తయ్యా ఏడవకు.' అంటూ ఆమె కన్నీరు వత్తాను. ఆమె నవ్వుతూ 'అలానేలేరా బాబూ!' అంటూ నా బుగ్గలు పుణికి ముద్దుపెట్టుకుంది ఆ తర్వాత పదిరోజులకు అనుకుంటాను నాన్న వచ్చారు. అప్పుడు మానాన్నని అడిగేశాను. 'అత్తయ్యని మనింటికి ఎందుకు రానివ్వరూ?' అని. దానికి నాన్న తేలిగ్గా

నవ్వేస్తూ 'మీ అత్తయ్యను నేను రావద్ద న్నానా? మీ పిన్నీ, అత్తయా ఎందుకో పోట్లాడుకున్నారట నేనులేని సమయంలో అత్తయ్య వెళ్ళిపోయింది. కోపంగా మనింటికి రావడం మానేసింది' అని చెప్పి, నా చదువూ, భోజనం ఎలా ఉంది? అని ప్రశ్నించారు. అత్తయ్యను మీరు పిలవండి అన్నాను మళ్ళీ. అతని మాటకు జవాబివ్వకుండా. ఆయన అదే నవ్వుతో నేను పిలవలేదనుకున్నావా? నువ్వు పెద్దవాడివయితే కాని ఇటువంటి విషయాల్లో జోక్యం పెట్టుకోకూడదు బాబూ! అన్నాడు మందలింపుగా. తర్వాత నేను మౌనంగా ఉండిపోయాను. మరికొంచెంసేపు ఉండి ఓ ప్రశ్నలువేసి వెళ్ళిపోయారు. ఆ తర్వాత మరి అత్తయ్య నన్ను చూడటానికి రాలేదు. అప్పుడప్పుడు నాన్నే వచ్చేవారు. ఉత్త రాలూ వచ్చేవి ఆయన దగ్గరనుంచి. విన్నారు కదూ!"

"వింటున్నాను. మరి మీ పిన్ని వెళ్ళిపోయారా?"

"చెబుతున్నానుగా. అత్తయ్య ఎక్కువ పాలుపోసిన చిక్కటి కాఫీ నాకు తెచ్చి ఇచ్చింది. నన్ను తీసుకు వచ్చిన నాన్న మౌనంగా తన గదిలోకి వెళ్ళిపోయారు. కాఫీ తాగుతుంటే ఓ చంటిపాప ఏడుపు వినిపించింది. ఉలికి పాటుగా లేచినిల్చుని గబగబా కాఫీ తాగేసి ఆ ఏడుపు వినిపిస్తున్నవైపు నడిచాను. ఇందాక ఈ గది చూడలేదు. పిన్నికూడా ఈ గదిలోనే ఉండి ఉంటుంది, అనుకుంటూ ఆ పాప ఉన్న గదిలో అడుగుపెట్టాను. గదిలో తొట్లలో అందంగా బొద్దుగా ఉన్న నెలల పాప. అప్పుడు నా హృదయంలో అనిర్వచ నీయమైన ఆనందం. అత్తయ్య పాపో. పిన్ని పాపో. అనుకుంటూ పాపని మృదువుగా చేతుల్లోకి తీసుకుంటూ సంతో షంగా ఆ పాప బుగ్గలు ముద్దుపెట్టు కున్నాను. పల్చటి నీటి తెరలోంచి అంద మైన గుండ్రని కనులు మెరుస్తూంటే ఆ పాప నా వైపు చూసి నోరంతా అవ లించి నవ్వింది అమ్మదొంగా! నన్ను చూసి నవ్వుతున్నావా? అత్తయ్య నిన్ను ఏడిపించేసింది కదూ! అని మళ్ళీ పాపని హృదయానికి ప్రేమగా హత్తుకుంటూ ఒత్తుగా, మెత్తగా ఉన్న పావజుట్టు సవ రించి పాప నుదిటిమీద ముద్దుపెట్టు కున్నాను.

ఆ గదిలో కూర్చున్న నాన్న నన్ను పరిశీలనగా చూస్తూన్నారు కాబోలు ఓ మూల కుర్చీలో కూర్చున్న ఆయన్ని నేను చూడనేలేదు. 'నీకు చెల్లెలంటే అంత ఇష్టంరా పాణీ!' అన్నారు నవ్వుతూ. 'ఈ పాప నా చెల్లెలా? ఇష్టమే. చాలా ఇష్టం పిన్నేదీ! పిన్నిని నాకు చూపిం చరా నాన్నా!' అని అడిగాను. ఆ ప్రశ్నకి ఆయన బాధగా నిట్టూర్చి,'లేదు బాబూ మీ పిన్ని వెళ్ళిపోయింది అన్నారు.

"ఎక్కడికి? నేను రావడం ఆమెకు ఇష్టంకాకపోతే నన్ను మళ్ళీ ఆ స్కూలుకి పంపించెయ్యండి నాన్నా. అంతే కాని చంటిపాపకి అమ్మలేకపోతే ఎలా! అన్నాను.

"ఇహ రాదు బాబూ! నేను దుర దృష్టవంతుణ్ణి. ఉత్తమ సాధ్వి మీ అమ్మ నన్ను అన్యాయంచేసి పోయింది. మనస్సు వికలమై పిచ్చివాణ్ణి అయిపోతానేమో! అనే తరుణంలో ఆ శోకానికి విరుగుడు మళ్ళీ వివాహమే అని పెద్దలు ప్రోత్స హించడంతో, నిజమే అనే గుడ్డి నమ్మ కంతో మీ పిన్ని మెడలో తాళి కట్టాను. కాని...ఆమెతో కాపురంచేసిన ఈ ఎని మిది సంవత్సరాలూ నరకాన్ని చూశాను బాబూ! మానసికంగా చిత్రవధ అనుభ వించాను తల్లిని పోగొట్టుకున్న నీకు కాని భర్తను పోగొట్టుకున్న అత్తయ్యకు కాని ఈ ఇంట్లో క్షణం నిల్చునే అవ కాశం ఇవ్వలేకపోయాను. అని ఒక ఆత్మీయుడి దగ్గరలా ఎనిమిదేళ్ళు నిండిన నా తో అతని హృదయవేదన ఇంకా ఏమేమో చెప్పి వెల్లడించుకున్నారు. ఆ తర్వాత కొంతకాలం పోయాక కాని ఆ మాటల అర్థం నాకు తెలియలేదు. అప్పుడు మాత్రం అలా చెబుతూన్న నాన్నవైపు బిత్తరిచూపులు చూస్తూ నిల్చుండిపోయాను. అప్పుడు నాకు అర్థమైనది పిన్ని చచ్చిపోయిందని. పాపకు తల్లిలేదని. తల్లిలేని పాపని

చూస్తూంటే నా లేత హృదయం జాలితో ద్రవించిపోయింది. నాకు ఏడుపు వచ్చేసింది. అలా చేతుల్లో ఉన్న పాపవైపు చూస్తూ వెక్కి వెక్కి ఏడవటం ప్రారంభించాను. అత్తయ్యా, నాన్న నన్ను ఎంతో ఓదార్చి, ఎందుకు ఏడుస్తున్నావ్? అని ప్రశ్నిస్తూంటే జవాబు చెప్పలేకపోయాను ఎంతోసేపు. తర్వాత చిన్ని చచ్చిపోతే. ఇంత చంటిపాప ఎలా బ్రతుకుతుంది నాన్నా! పాపనెవరు పెంచుతారు! అన్నాను కళ్ళు తుడుచుకుంటూ? ఓరి బడవా! అదా! నేను పెంచుతాలేరా? అందుకా ఈ ఏడుపు? అంటూ నవ్వింది అత్తయ్య. 'పాప ఇంకా ఐదునెలలు అమ్మపక్కలో పడుకుని, పాలుతాగి పెరిగింది. కాని నువ్వు మీ అమ్మ చచ్చిపోయేసరికి కన్ను తెరవని గుడ్డువి. నిన్ను మీ అమ్మమ్మ పెంచారు కదూ! అన్నారు నాన్న. అప్పటినుంచీ నా జీవితం మలుపుతిరిగిందనే చెప్పాలి. నేనూ మా శశి అత్తయ్యా, నాన్న చేసే గారాబంతో, సంతోషంగా, హాయిగా పెరుగుతూ వచ్చాం శశికి నేనంటే చాలా అభిమానం. అదంటే నాకూ ప్రాణమే. ఇంకా ఈ జీవితంలో ఎన్నెన్నో అనుభవిస్తానని అందమైన భవిష్యత్తులోను ఊహించి కలలు కంటూ ఆదమరపుగా ఉన్నవేళ విధి నాపై ఎదురుదెబ్బ తీసింది. బి.ఎ. ఫైనలియరు చదువుతూన్నప్పుడు నా కళ్ళు మండటం. వాటి ఎర్రవారడం ప్రారంభించాయి. నిద్రలేమి. వేడి అని సరిపెట్టుకొనే వాడిని కాని పూర్తిగా అంధుణ్ణయిపోతాననీ, విధి నన్నింత క్రూరంగా శిక్షించబోతూందనీ ఊహించలేకపోయాను పద్మావతీ! నన్ను డాక్టరుకి చూపించి నా కనులు టెస్టుచేయించిన తర్వాత ఆ డాక్టరు నాన్నకు ఏం చెప్పారో. నాన్న ఆరోజు భోజనం చెయ్యలేదు. ఏదో విపరీతంగా బాధపడుతూన్నట్లు, స్వరం కోల్పోయినట్లూ దిగులుగా ఉండిపోయారు. అస్థిమితంగా ఇల్లంతా తిరిగారు. నన్ను ఏ పుస్తకాలూ చదువవద్దనీ కాలేజీకి వెళ్ళవద్దనీ చెప్పారు. పరీక్షలు దగ్గరవుతున్నాయ్ నాన్నా వెళ్ళకపోతే ఎలా? అన్నాను. వద్దుబాబూ! బి.ఎ. పాసవనంత మాత్రాన్న నీకు జరక్కపోదు. నీ కళ్ళు బాగయితే అవే పదివేలు అన్నారు. నన్ను కాలేజీకి వెళ్ళనివ్వలేదు. మాకు డబ్బుకు లోటులేదుగా! ఎవరెవరో పెద్ద పెద్ద డాక్టర్లే వైద్యం చేశారు. కాని విధి నెవరు తప్పించగలరు పద్మావతీ! నా ఖర్మకు ఎవరు కర్తలు చెప్పండి. నాకు పూర్తిగా దృష్టిపోయినరోజు బాగా గుర్తుంది. అవ్వాళ మంచంమీద కూర్చొని రవీంద్రనాధ్ ఠాగూర్ ఫోటోవైపు చూస్తున్నాను. ముందు మసకమసకగా కనుపించి ఒక్కసారిగా కనులముందు చీకటి పరుచుకుంది. రెండు మూడుసార్లు కళ్ళు

నులుముకొని చూశాను. కాని నా కళ్ళ ముందు అంతా చీకటే. శశీ! అని పిల్చాను రుద్ధస్వరంతో. పిల్చావా అన్నయ్యా అంటూ వచ్చింది మా శశి. ఆమె నాకు కనుపించలేదు. ఆ మాట శబ్దాన్ని బట్టి ఆమె నాకు దగ్గరగా వచ్చిందని గ్రహించాను' 'నా కళ్ళు పూర్తిగా పోయాయి శశీ! నాకు కనుపించడంలేదు అన్నాను. ఇంచుమించుగా ఏడుస్తూనే. నా పక్కన కూర్చుని నా మెడచుట్టూ చేతులుచుట్టి నా భుజంమీద తల ఆన్చి, అన్నయ్యా అని వెక్కి వెక్కి ఏడవటం మొదలుపెట్టింది శశి. తర్వాత పిచ్చి తల్లి. దేవుడెక్కడ ఉన్నాడు? అతనికి ఎన్ని మొక్కులు మ్రొక్కుతున్నాం నీ కళ్ళు బాగపడాలని దేముడే ఉంటే నువ్వేం చేశావని ఈ శిక్ష విధించాడు? అన్నయ్యా దేముడు లేడు మనమంతా ఓ మూఢనమ్మకంతో ఈ కాయితపు బొమ్మలకి రాతి బొమ్మలకి మొక్కుతున్నాం అని. నేను వద్దు. తప్పు అని వారిస్తున్నా. ఆ గదిలో ఉన్న దేముడు పటాలన్నీ పగుల గొట్టి కాయితాలు చించి పారేసింది. ఇహ ఆ తర్వాతేముంది? నాన్నగారు వచ్చారు. అవ్వాళ అంతా ఎవరో ఆత్మీయుడు పోయినట్లు ఏడ్చారు.

'నేను చచ్చిపోతాను. ఏదన్నా విష మివ్వండి అని తల బాదుకు ఏడ్చాను. అప్పాళే కొన్ని రోజులు ఆత్మహత్యా ప్రయత్నం చేస్తూ వచ్చాను. ఎవరో ఆ ప్రైముకి అడ్డుపడేవారు ఓసారి నేను తల గోడకేసి కొట్టుకుంటూ ఉంటే, ఇంకె ప్పుడూ ఇలాటి ఆత్మహత్యా ప్రయత్నం చెయ్యకూడదని నాన్న నాచేత ప్రమాణం చేయికచారు వింటున్నారా?"

"వింటున్నాను. ప్చ్. పాపం" అంది పద్మావతి ఆర్ధ్రస్వరంతో.

"ఎప్పుడో ఏదో ఘోరమైన పాపం చేసి ఉంటాను పద్మావతీ! అందుకే నాకీ శిక్ష పడింది. తర్వాత కొన్నాళ్ళకి, ఎవరో అమెరికన్ 'ఐ' స్పెషలిష్టు వచ్చారు. మళ్ళీ నా కనులు బెస్టుచేయించి ఎంత డబ్బు ఖర్చయినా పర్వాలేదు. మీ కెంత ఫీజన్నా ఇస్తాను. నా కొడుకు కనులు బాగుచేయండి. అని అతన్ని ప్రాధేయపూర్వకంగా అర్థించారు నాన్న. దృష్టి రావచ్చు లేదా ప్రాణం కూడా పోవచ్చు. అలా మీరు సమ్మతించి సంతకంచేస్తే ఆపరేషను చేస్తానన్నారట ఆయన. కళ్ళు లేకపోతే పోనీ నాకు ఒక్కడే కొడుకు, నా వంశానికి వాడే వారసుడు అని ఆపరేషను చేయించడా నికి అంగీకరించలేదు. అస్సలు అప్పటి నుంచి నాకళ్ళు బాగుచేయి చాలనే ప్రయ త్నమే మానేశారు. కాని మిగిలిన కాల మంతా, నిరాశా నిస్పృహలలోనే జీవిం చారు. నా గురించి ఆలోచిస్తూ మనస్సు పాడుచేసుకున్న నాన్నగారి ఆరోగ్యం దెబ్బతింది. శశికి పద్దెనిమిదేళ్ళ వయస్సు వచ్చింది. ఏళ్లైవేల రూపాయల ఆస్తి కట్నంగా రాసిచ్చి విద్యావంతుడూ, రూపసీ అయిన వరుడికిచ్చి వివాహం చేశారు. ఈ గుడ్డి అన్నయ్యను వదిలి వెళ్ళలేక ఎంతో ఏడ్చింది మా శశి మా బావగారు కూడా మంచి సంస్కారవం తులు. శశి అత్తవారింటి కెళ్ళిన నాలుగు నెలలకు మా నాన్నగారి ఆరోగ్యం కొత్తిగా పాడయిపోయింది. ఆయనపోయే టప్పుడు నన్ను రంగారావుగారికీ అత్త య్యకూ, మా శశికీ, ఆమె భర్తకూ ఒకరికనేమిటి? మాకు పరిచయమున్న వ్యక్తులేకాక పనిచేసేవారికీ, అందరికీ అప్పగించారు. అశాంతిగానే ప్రాణం వదిలారు."

"మీ నాన్నగారు పోయి ఎన్ని సంవ త్సరాల యిందంటారు?"

"ఆరు సంవత్సరాలయి ఉంటుంది."

"ఆయన మీకు పెళ్ళిచెయ్యాలని ప్రయత్నించలేదా?"

నవ్వి, "చెయ్యకేం? అంతపనీ చేశారు. ఆయన పోయాక అత్తయ్య వత్తిడికి లొంగి మరొక అమ్మాయి మెడలో తాళి కట్టాలని కూడా అను కున్నా నోసారి."

"మరెందుకు మానేశారు? మరొక అమ్మాయంటే?"

"అహ. నేను అనుభవించేది దుర దృష్టం మరొక అమ్మాయికి కూడా ఎందుకు పంచడమని."

"ఓ. అదా!"

"నేను అంధుణ్ణవతానని తెలియ నప్పుడు నాకు పెళ్ళిచెయ్యగలరు ఎవ రన్నా కాని ఇప్పుడు ఎలా చెయ్యగలరు? ఎలా చేసుకుంటాను? కాని ఒక అమ్మాయి, పేదరికంవలన నా ఐశ్వ ర్యంపై మోజుతోనూ కాబోలు నన్ను వివాహం చేసుకోడానికి అంగీకరించింది. నా దగ్గరకు మా అత్తయ్య ఆ అమ్మా యిని తీసుకువచ్చింది. ఆ అమ్మాయి తన అంగీకారాన్ని దృఢంగా వ్యక్తం చేసింది. ఆ క్షణంలో ఆ అమ్మాయిని పెళ్ళిచేసుకోవడం మంచిదేమో! అనిపిం చకపోలేదు. అయితే రెండు రోజుల వ్యవధి నేను ఆలోచించుకోవటానికి కావా లన్నాను. ఆ మరురోజు రంగారావుగారు వచ్చి మీ గురించి చెప్పారు...." ఆగాడు.

"ఆ రెండు రోజుల్లో మళ్ళీ ఆ అభి ప్రాయం మార్చుకున్నారా?"

"అవును." అని "అత్తయ్యా" పిల్చాడు పాణి.

ఆమెరాగానే అత్తయ్యా "ఐస్‌షర బత్ కొంచెం కావాలి. రెండు గ్లాసులు పంపించు'' అన్నాడు.

అలాగే అని ఆమె వెళ్ళిపోయింది.

"నేను చదువుకునే రోజుల్లో ఎంత ఉషారుగా పెంకెవాడిగా ఉండేవాడినో తెలుసా పద్మావతీ! డబ్బులు విరివిగా ఖర్చుచేసేవాణ్ణి స్టూడెంట్సు హీరో అనే వారు నన్ను. నాన్న నాకు అవసరానికి మించి డబ్బు పంపించేవారు. ఫ్రెండ్సంద రినీ తరుచు కాఫీ హోటలుకి తీసుకు పోయేవాణ్ణి. ఓ ఇద్దరు పేద విద్యార్థు లుండేవారు. వారికి అప్పుడప్పుడు ఫీజులు నేనే కట్టేవాణ్ణి అలా కట్టానని చెప్పినా! నాన్న ఏమీ అనేవారు కాదు. వాళ్ళు ఇప్పటికీ నాకు ఉత్తరాలు వ్రాస్తూ ఉంటారు. జానకిరాం అనే అతను బి కాం. ప్యాసై మంచి ఉద్యోగంలో ఉన్నాడు. రాజారావు అనేవాడు వ్యాపారంలో స్థిర పడ్డాడు. అప్పుడప్పుడు నన్ను చూడ టానికి కూడా వస్తూంటారు.

అన్నపూర్ణమ్మ రెండు షరబత్ గ్లాసులు తెచ్చి పద్మావతికి పాణికి చెరొ కటి అందించింది.

"అప్పారావు రాలేదా అత్తయ్యా!" అడిగాడు పాణి.

"రాలేదు బాబూ!" అందామె.

ఆ తర్వాత స్వవిషయాలింకేమీ చెప్పలేదు పాణి. ఆమె ప్రశ్నించనూ లేదు. మరికొంతసేపు. ఏవో సిని మాలూ, పత్రికలూ గురించి మాట లయ్యేక! వెళ్ళిపోయింది పద్మావతి.

(సశేషం)

Printed and Published by A. Chandrasekhar Rao, at 5-9-88, Public Garden Road, Hyderabad, for YUVA Publications and Printed at Dolton Press, Hyderabad-500 001 Controlling Editor "CHAKRAPANI"

విశ్రాంతి పొందండి!
చార్మినార్ త్రాగండి.

అచ్చమైన మేలిరకం
పొగాకుల పరిమళము
కమ్మదనం అనుభవించండి




చార్మినార్ భారతదేశపు
అత్యధికంగా అమ్ముడుబోయే
సిగరెట్

వి.ఎస్.టి. తయారీ

* సిఫారసు చేయబడిన అధికతమ చిల్లర ధర (స్థానిక పన్నుల అనుసారం)

CHVS-133-182 & TEL